# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1958

సంపుటము ౩౫ · . సంచిక ౯

విడిపత్రిక వెల ఒక రూపాయి




లక్షలాది ప్రజలు 1893 నుండి దేశమంతటా అమృతాంజనాన్ని వాడుతున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పక్కపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపచేస్తుంది




అమృతాంజనము
అన్ని నొప్పులకు
దివ్యామృతము



అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు-4, బొంబాయి-1, కలకత్తా

ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం॥ లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాష లన్నింటిలో వెలువడే హాస్యపూరిత కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1958

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

* గతసంచిక తరవాయి *

హారినీలస్థగితావనీతలమునం దందాలొలిందమ్మునై
వరబృందావనవాటికన్ పరమశోభాపేటికన్ దృశ్యమౌ
హారనానామణిమండపాగ్ర విబుధోద్యత్ భూజమూలమ్మునన్
బరమమ్మైన రయియారి మాయుక వచో మత్తేభ సంచారిణిన్.

శిరమం దూగెడు కేకిపింఛియుమునో శైలైవ కనద్రత్నసుం
దర కోటీర విశుంబి తాగ్ర లలితోద్యత్కుంతలాగ్రాంతమై
స్ఫురదానీల విలోలఖేలదలకస్ఫూర్జల్లలాటేందు సుం
దరమై, శ్రీ శరదిందు బింబరుచి చందం బొప్ప నెమ్మోమునన్.

దలదంభోజదలాశిలోచనము సుద్యత్పక్వ బింబాధరా
కలితస్మేర శుచిస్మితాకలిత తద్దంతావళీకాంతి సం
కులితాశాంబర, మిందుపాండురలసద్గండస్థలీలోలకుం
డలముల్ సూక్తిక మంజరీ మధుర కర్ణశ్రీక సుశ్లోకముల్.

ఉరమై గుండ్రశతనమ్ముగల్ గలిగి మెంతో యొప్పు ముక్తాలహా
ర రుచిం గుల్కెడు కంఠదేశ మటుపై రమ్యేంద్రనీలావనీ
ధరరోచిల్ జితమ్ము సేయు వరమోదార ప్రభాపూర మ
వ్వరలక్ష్మీ శుభమందిరాయిత మహోవక్షఃస్థలాద్రిప్రముల్.

చరణాబ్జమ్ముల నానఖస్ఫురణ మగ్రాంతంబు జీరాడుచున్
వరభోగీంద్ర సమానదోర్యుగముగన్ వాసించి వ్రేలాడుచున్
వరవర్ణాభము దట్టమై మెఱుపుదీవం దాల్చు చందంబు దో
ప్వరహార్ ఫుల్లవనామలవ్రజము శోభల్ నించు సౌందర్యముల్.

మణిమత్కంకణ కాంతిమాంసలము, శుంభత్పుల్లపద్మారుణా
రుణ, మ్మగ్రాంతనతాగ్రశితోద్ధరణమై రూపించుహస్తద్వయిన్
గణుతిన్ రత్నమయాంగుళీయకవిభా కల్యాంగుళిన్ వేణు పూ
రణముం జేసి యశేష జీవుల మనోరాగశ్రుతుల్ గాంచుమున్.

ఉదరోద్యద్ద్యుతినిమ్నగాలహరియై యొప్పారు నూగారు ను
న్నదగోపీ నయనానుకర్షణ సునిమ్నంబైన యన్నాభి యొ
ప్పిదమై బంగరు నీరునన్ దొలఁకు నా పీతాంబర శ్రీ ప్రభా
మృదులమ్ముల్ మఱి యూరువుల్ గులుకు నా మేలైన సౌభాగ్యమున్.

లలిత శ్రీమణినూపుర శ్రుతిజటాలంబైన జంఘాయుగ
మ్మలఘుస్పర్థి ముఖస్థ దంతివరహస్తాగ్రైక జంఘాలమం
జుల జంఘాయుగ దివ్యవైభవమునై శోభిల్లు చిద్బింబమున్
కులిశమ్మంకుశమంబుజమ్ము మఱిశంఖున్ జక్రమున్ గేతన
మ్ముల రేఖల్ గులుకంగ కోమలములై ముద్దుల్ పిసాళించు మం
జులముల్ పాదతలంబులున్ జెలఁగు మేల్ సొంపున్ నిగారింపునన్
దొలుకన్ బ్రహ్మశివాది దేవమకుట స్తోమాగ్రరత్నప్రభా
కలిత శ్రీనఖ చంద్రికావిదళిత క్షోణీజనక్షోభమై

చెలువౌ పాదయుగమ్మునం గల కృపాశృంగారమాకారమున్
కలలో నిద్దురలేని మేల్కొలుపులో గన్గొందుగా ఇంటిలో
వెలి రాదారుల దారులం దదియ యోవిశ్వేశ! నీమూర్తి క
న్నులలోఁ గట్టిన యట్లు చిత్తమున నెంతో హత్తినట్లయ్యెడిన్.

నవఘన నీలిమద్యుతి కనన్నమనీయ మశేష వేదవై
భవకమనీయ మాసొబఁగు పాపగతిం బడిపోవు నన్ను నం
భవ మిదియౌను గాదనక మక్కువ కన్నులనేని యబ్బి మా
నవ పరమాణువున్ నను సనాథుని జేయురుగాక యిప్పడే.

హరి! నీకున్ బ్రణమిల్లి కోరెదనురా హా! అంజలింబట్టి నే
వరమీ యొక్కటిగాఁగ నొక్కటి ప్రభూ! వద్దెందునున్ జన్మ, మీ
శ్వర! పుట్టింతువొ భూమి దున్నుకొను నవ్వారింటఁ బుట్టింపు సుం
దర గోవిందపదారవింద మధుమత్తంబైన చిత్తమ్ముతో

అమృతస్యంది వచోవిలాసమును నావందించినావైన! స్వ
ప్నమునం దైనఁ దలంప నీకృప యహంభావాన సిగ్గింతలే,
దమిత మ్మీయపరాధమున్ గనక నన్నాత్మీయుగా గొన్న నీ
కు మరేదీ దయసాటి? మిత్రులను, నాకున్ సాటి యేదీ ప్రభూ!

# కరుణాలహరి

పాతాళంబున–కేగుమా సురపురిం బాలింపుమా మేరువుం
బాతూలోద్గతి నెక్కుమా జలధులం బాహూద్వయిం దాటుమా
చేతన్ సక్తములైన యాశలవి నిశ్శేషమ్ముగా వీడవో
భూతవ్యాధిజరాజ్వరాహత! సుఖంబుం గోరితేనిం మదిన్,
ప్రీతిం గృష్ణరసాయనమ్ము గొనుమా! వేరే క్రమ మ్మేటికిం

పాపమహీధరమ్ములకు వజ్రము, జన్మ రుజాభిభూత సం
తాప సుసిద్ధభేషజము, 'దంభ' తమఃపటలార్క బింబముం
వ్యాపృత దుఃఖభూరుహ దవాగ్ని కలాపము! 'కృష్ణ' నామమీ
శా! పరనిర్వృతి ప్రకట సాధకవాటము పొల్చు నున్నతిం

ఘనవిషయాటవీ శిఖ శిఖావితతిం వికలత్వమొంది నా
మన మిటు మాధురీ పరమ మందిరమందు ముకుంద ముగ్ధ మో
హనవదనేందుబింబమున నంచిత చారు చకోరవృత్తి చే
ననిమిషభావ మొంది యమృతాప్లుతమై విలసిల్లుఁ గావుతం

అమరతరంగిణీ పులినమందు సుఖాసనముండి కన్నులం
దమరిచి యోగముద్ర, విషయమ్ము లడగ్చి, హరించిలోని సం
తమసము సత్సుఖాత్మక సుధారస నిర్ఝరి నన్నుతాంబుదో
త్తమరుచిఁ జిత్కళం మునిఁగి ధన్యుఁడ నౌటది యెన్నఁడో కదా!!

# వసంతరాజీయము

## శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు

'వసంతరాజీయము' రెడ్డిరాజగు 'కుమారగిరి' చే (క్రీ. శ. 1386-1402) రచింపబడిన నాట్యశాస్త్రగ్రంథము. ఈ కుమారగిరిరెడ్డికి 'వసంతరాయలు', 'కర్పూరవసంతరాయలు' అను బిరుదులు కలవు. ఈ బిరుదులను బట్టియే అతని నాట్యశాస్త్రము 'వసంతరాజీయ' మనబడెను.

ఈ వసంతరాజీయము గ్రంథ మంతయును లభింపకపోవుట ఆంధ్రుల దురదృష్ట మని చెప్పక తప్పదు. ఈ గ్రంథమునుండి ఆయా వ్యాఖ్యాతలు తమ తమ వ్యాఖ్యానములందు ఉదాహరించిన లక్షణ శ్లోకములను బట్టి దీని స్వరూపమును మాత్రము కొంత యూహించుటకు వీలగుచున్నది.

'వసంతరాజీయ' మను పేర శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు 'హాక్' స్మారక సంచికలో ఒక ఆంగ్లవ్యాసమును ప్రకటించినారు. ఆ వ్యాసమునందు రెడ్డిరాజుల చరిత్ర వివరింపబడినది; అంతమున మాత్రము వసంతరాజీయమందలి తొమ్మిది శ్లోకములు ఉదాహరింపబడినవి. శ్రీమాన్ కృష్ణమాచార్యులుగారు కూడ తమ 'సంస్కృతవాఙ్మయ చరిత్ర'లో ఈ శ్లోకములనే ఉదాహరించియున్నారు.

ఇప్పుడు నే నింకను చాల శ్లోకములను సేకరించినాను. వానిని సహృదయుల పరిశీలనార్థము నివేదించుటకే ఈ నా ప్రయత్నము.

వసంతరాజీయ శ్లోకములను తమ తమ వ్యాఖ్యానములం దుదహరించిన వారిలో కాటయవేముడు ముఖ్యుడు. కాటయవేముడు కుమారగిరియొక్క బావమరది. ఇతడు కాళిదాస ప్రణీతము లగు మూడు నాటకములకును 'కుమారగిరి రాజీయము' అను పేర వ్యాఖ్యలను రచించెను. వసంతరాజీయశ్లోకములను పేర్కొనిన రెండవ వ్యాఖ్యాత తిమ్మరుసు మేనల్లుడైన నాదెండ్ల గోపమంత్రి. ఇతడు కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమునకు 'చంద్రిక' అను వ్యాఖ్యను రచించెను. వ్యాఖ్యాతృచక్రవర్తి యగు మల్లినాథసూరి శిశుపాలవధవ్యాఖ్యలోను, వాని కుమారుడగు కుమారస్వామి ప్రతాపరుద్రీయ వ్యాఖ్యలోను వసంతరాజీయమునుండి కొన్ని శ్లోకములను పేర్కొనియున్నారు. నేను చూచినవి ఇవి మాత్రమే. ఇంకను ఎందఱు వ్యాఖ్యాతలు వసంతరాజీయ శ్లోకములను పేర్కొనిరో తెలియదు. పరిశోధకు లింకను పరిశీలింపవలసియున్నది

నేను పరిశీలించిన పై వ్యాఖ్య లన్నియును ముద్రితములే. వాని వివరముల నీ క్రింద నొసంగుచున్నాను.

1 కాటయవేముని అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్య—దీనిని శ్రీ వి. శంకరరామశాస్త్రిగారు ప్రకటించినారు. (అభిజ్ఞాన శాకుంతలము—బాలమనోరమా ప్రెస్, మద్రాసు, 1947)

2 కాటయవేముని మాలవికాగ్నిమిత్రవ్యాఖ్య—దీనిని శ్రీ ఎమ్. ఆర్. కాలెగారు ప్రకటించినారు. (మాలవికాగ్నిమిత్రము—గోపాల్ నారాయణ్ అండ్ కో, బొంబాయి, 1932).

3. కాటయవేముని విక్రమోర్వశీయవ్యాఖ్య—దీనిని శ్రీ చారుదేవశాస్త్రిగారు ప్రకటించినారు. (లాహోరు, 1929)

[పై వ్యాఖ్యలను మరికొందఱు కూడ ప్రకటించినారట. అవి నాకు లభ్యము కాలేదు]

4 గోపమంత్రి ప్రబోధచంద్రోదయవ్యాఖ్య—దీనిని శ్రీ వాసుదేవశర్మగారు పరిష్కరించినారు. (ప్రబోధచంద్రోదయము—నిర్ణయసాగర ముద్రణాలయము, బొంబాయి, 1898)

5. మల్లినాథసూరి శిశుపాలవధ వ్యాఖ్య—(శిశుపాలవధము — నిర్ణయసాగర ముద్రణాలయము, 1917).

6. కుమారస్వామి ప్రతాపరుద్రీయ వ్యాఖ్య—దీనిని శ్రీ కె. పి. త్రివేది ప్రకటించెను. (ప్రతాపరుద్రీయము—బొంబాయి, 1909).

* పులకాం గతికాంప్రేమ్ణం యథాస్తైర్వ్యక్తచేష్టితైః।
రాగాతిశయసంపన్నాం వర్ణయేదభిసారికాం॥ 51
—(విక్ర ఊర్వ. వ్యాఖ్య-పుట. 60)

[ఈ శ్లోకములకుముందు 'అభిసారికా లక్షణముక్తం వసంతరాజీయే యథా' అని కలదు. కావున ఇవి వసంతరాజీయములోని వనుట స్పష్టము. యిందలి శ్లోకములను శ్రీ వేంకటరామన్ గారు పేర్కొనియున్నారు.]

## వేశ్యానాయిక

వేశ్యేతి నాయికారాజ్ఞః పాదివాక్య సౌష్ఠ వ్యమానసీ।
—(విక్ర. వ్యాఖ్య-పుట-18)

[ఈ శ్లోకపాదమునకు ముందు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. కావున ఇది వసంతరాజీయములోని దనుట స్పష్టము. ఈ శ్లోకార్థమును సమర్థించు 'తథాచ భారతీయే' అని చెప్పి భరతుని నాట్యశాస్త్రమునుండి శ్లోకములను కొన్నింటిని కాటయవేముడు ఉదాహరించియున్నాడు ]

## కుపితనాయికల ననునయించు నుపాయములు

* సామ్నా దానేన భేదేన ప్రత్యుపేక్షారసాంతరైః॥ 52
మానాపనయనం తాసాముపాయైః షడ్భిరాచరేత్ ।
—(విక్ర ఊర్వ వ్యాఖ్య పుట 49)

ఈ శ్లోకమునకు ముందు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. కావున ఇది వసంతరాజీయములోని దనుట స్పష్టము ]

## నృత్తారంభోచితావస్థానము

* అంగస్య చతురశ్రత్వం సమపాదౌ లతాకరౌ॥ 53
ఆరంభే సర్వనృత్తానామేతత్స్థానమిష్యతే।
—(మాల. అగ్ని. వ్యాఖ్య—పుట 26)

[ఈ శ్లోకమునకు ముందు 'తథాచోక్తం వసంతరాజీయే' అని కలదు కావున ఇది వసంతరాజీయమునందలిదే అనుట స్పష్టము.]

## కపోత హస్తము

కపోతః ప్రాంతసంశ్లేషాదంజల్యర్ధం సర్పశీర్షయోః॥ 54
—(శా. వ్యాఖ్య పుట 144)

## నైపథ్య భేదములు

(చతుర్విధాహార్యాభినయములు)—

పుస్తం ప్రదర్శితం నాట్యే చిత్రాభ్రకపాటాదికమ్।
కుండలాది విధాలంకరణా వ్యప్తకేవలమ్॥ 55
సంజీవః పశుపక్ష్యాది ప్రాణినాం రూపధారణమ్।
—(శా. వ్యాఖ్య-పుట. 8)

## విషవేగములు

* వైవర్ణ్యం వేపథుర్దాహః ఫేనః స్కంధభంజనం॥ 56
దుఃఖం జాడ్యం మృతిశ్చేతి విషవేగాః స్యురష్టధా।
—(మాల. అగ్ని. వ్యాఖ్య-పుట. 69)

[ఈ శ్లోకమునకు ముందు 'విషవేగాస్తు వసంతరాజీయే కథితాః' అని కలదు. కావున ఇది వసంతరాజీయమునందలిదే ]

## అధర భేదములు

* వివర్తితో వికాసీ చ విసృతశ్చ వినిగూహితః॥ 57
ఆయతో రేచితోఽన్యే తు సంవృతశ్చ సముద్గకః।
* కంపితశ్చేతి నామ్నైతే రదనో దశధాధరః॥ 58
తత్ర –
* ప్రసారితో విసృష్టాఖ్యోఽవదరే దర్శితోఽగ్రణః।
(శా వ్యాఖ్య పుట - 185)

[ఈ శ్లోకములకు ముంగు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు కావున ఇవి వసంతరాజీయమునందలివే ]

## ధ్రువా భేదములు

* సూచకీ పాత్రభేదానాం తత్ప్రకారార్థ సూచనీ॥
యాగీతిః సా ధ్రువా తుల్యసం విధాన వివేచనే।
* ప్రావేశిక్యాక్షేపికీ చ తథా ప్రాసాదికీ చ॥ 60
నైష్క్రామికీత్యంతరీ చ తాసాం లక్షణముచ్యతే।
* ప్రవేశసూచకా యా తు ధ్రువా ప్రావేశికీ మతా॥ 61
ప్రసంగముద్యతేఽన్యార్థస్యాక్షేపాదాక్షేపికీ మతా।
* ప్రాసాదికీ తు పాత్రాణాం వ్యాకులానాం ప్రసాదనాత్॥ 62
నిష్క్రామసూచికా యాంతే ధ్రువా నైష్క్రామికీ భవేత్।
* విహారే విస్మృతౌ క్రోధే ప్రమాదే సంభ్రమే మదే॥ 63

"మీ పేరు?"

"విశ్వేశ్వరరావు"

"కాలం సాగిపోతోంది అనే విషయం ఇంతకు ముందు మీకెప్పుడైనా స్ఫురించిందా?"

"స్ఫురించకుండా ఉండటానికి అదేం కొత్త సంగతి కాదు గదండీ!" కొంచెం నవ్వుతూ అన్నాడు విశ్వం

"అప్పుడు మీ భావాలు ఎలా వుంటాయో చెప్పగలరా?"

"నిన్న, ఇవాళ, రేపు—ఇదే కదా కాలం అంటే, అనిపించేది నాకు ఒక్కొక్కప్పుడు కాలం మీద ఏమైనా కవిత్వం రాద్దామని ఉండేది కాని సరైన భావాలు రాకపోవటంవల్ల రాయలేదు"

"మీ వయసెంత?"

"ఇరవై రెండు"

"ఈ ఇరవై రెండేళ్ల కాలంలో ఎన్నో పనులు చేసి ఉంటారు మీరు"

"అవును, మరి"

"ఇన్ని సంవత్సరాల్లో మీరు చేసిన అతి ముఖ్యమైన పని ఒకటి చెప్పగలరా?"

విశ్వం ఆలోచించాడు.

"ఏదైనా సరే, మీరు గుండెమీద చెయ్యి వేసుకుని ఫలానా శుభకార్యం చేశానని చెప్పగల ఒక్క పని, కనీసం ఒక్క మంచి పని చెప్పండి చాలు"

విశ్వం నుదుటిమీద స్వేదబిందువులు చేరాయి. ఒక్క మంచి పని తను ఒక్క మంచి పని కూడా ఇంతవరకూ చెయ్యలేదా? గొప్ప పనికాకపోవొచ్చు-కాని కనీసం ఒక్క మంచి పని.

విశ్వం తలవంచుకున్నాడు విచిత్రంగా

"కానీ కనీసం అలాంటి పనిఏదైనా చెయ్యాలనుకున్నారా?"

"ఎందుకనుకోలేదు" అన్నాడు విశ్వం తెప్పరిల్లి

"ఏమిటది?"

విశ్వానికి పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. ఎంత ఆలోచించినా ఏమీ తట్టటం లేదు.

"ఒక్క ప్రశ్న అడుగుతాను. తడుముకోకుండా సమాధానం చెబుతారా?"

"అడగండి."

"మీ జీవిత లక్ష్యం ఏమిటి?"

ఏమిటి తన జీవిత లక్ష్యం? శూన్యంగా చూశాడు విశ్వం.

"మీకు ప్రత్యేకించి ఏమీ లక్ష్యం లేదన్న మాట?"

తను పూర్తిగా పరాజితం పొందాడు కాని పరాజయం కంటె కూడా తన నిర్వ్యాపారకత్వం అతన్ని బాధపెట్టింది ఇటువంటి ప్రశ్నే తనలో ఎప్పుడూ ఉదయించలేదు.

ఎంత భావదారిద్ర్యం!

ఉపన్యాసకుడు విశ్వం భుజం తట్టి అన్నాడు "జరిగిన కాలంలో మీరేమీ చెప్పతగిన పని చేసివుండకపోవొచ్చు పరవాలేదు రాబోయే రోజుల్లో మీరు తోటివాళ్లు నిర్విణ్ణులయే మహాకార్యాలు చెయ్యవచ్చు కావలసిందల్లా చెయ్యాలనే ఉత్సాహం, కోరిక ఉండటం. జీవితంలో ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకోవటం గమ్యం చేరుకోటానికి నిజాయితీతో ప్రయత్నించటం. అంతే"

"కృతజ్ఞుడిని" అన్నాడు విశ్వం

"మీకెప్పుడైనా మాట్లాడాలిసిన విషయాలుంటే తరవాత మిమ్మల్ని కలుసుకుంటాను ఇదిగో నా అడ్రసు" ఒక చిన్న కార్డు విశ్వానికిచ్చాడు ఉపన్యాసకుడు విశ్వం అది స్వీకరించి సెలవు తీసుకుని బరువుగా అడుగు వేసుకుంటూ మైదానందాటి బజార్లో ప్రవేశించాడు ఇప్పుడతని మనసులో విచారం లేదు తను త్వరలోనే మేల్కొన్నాడు అసలు తన జీవితం ప్రారంభమయే తరుణంకూడా అదే తన అస్తిత్వాన్ని తను సార్థకం చేసుకోగలడు.

బజార్లో నడుస్తున్నాడు విశ్వం బజారంతా అతనికి కొత్తకొత్తగా కనిపించసాగింది ఆరోజున ప్రతి వ్యక్తి శ్రమపడుతున్నాడు ధనసంపాదనకి. శ్రమకి తగిన ప్రతిఫలం మాత్రం అందరికీ ముట్టదు చిన్న చిన్న దుకాణదారులు రోజంతా శ్రమపడి వస్తువుల అమ్మకంకోసం నానాపాట్లూ పడుతూండటం తను చాలాసార్లు గమనించాడు. కత్తిలేని కోతవాళ్ళు అతని కళ్ళలో ఎప్పుడూ మెదుల్తూనే ఉంటారు. ఏమిటి దీనికి విరుగుడు? ఆలోచిస్తున్నకొద్దీ అతను విచిత్రా

తను ఇంతవరకు చెప్పదగిన మంచిపని ఒక్కటి కూడా చెయ్యలేదు

ప్రాణం నిల్పటం మంచిపనే కదూ!

విశ్వం ఇంకేమీ ఆలోచించలేదు. ఆ వ్యక్తిని మరోసారి పిలిచాడు. అతను ఏమనుకొన్నాడో గాని ముంగిలి విడిచి విశ్వందగ్గిర నిలబడ్డాడు. విశ్వం డ్రాయర్ జేబులోంచి వందరూపాయల నోటు తీసి అతనికందిస్తూ అన్నాడు

"ఇదిగో, తీసుకో, పని చూపించలేను, నిజమే కాని ఈ వంద రూపాయలతో ఏ కిళ్ళీ కొట్టో తెరిచి ఏదో విధంగా పొట్టగడుపుకో వొచ్చేమో ఏమంటావు?"

ఆ వ్యక్తి తెల్లబోయాడు. దుకాణంలోని వాళ్ళందరూ ఆశ్చర్యంగా విశ్వంవైపు చూశారు. "వంద రూపాయలే!" అని గుసగుసలు విశ్వానికి వినిపించాయి. ఆ అమ్మాయి విశ్వంవైపు తలెత్తి చూసి, మళ్ళీ ఇంకోసారి చూసి అర్థంకానట్టుగా ముఖం పెట్టింది.

విశ్వం గర్వంగా నవ్వుకున్నాడు. అమరావతి శిల్పంలా తను పెరిగిపోతున్నట్టనిపించింది అతనికి. తన దగ్గరున్న వాళ్ళందరూ మరుగుజ్జుల్లా అవుతున్నారు.

"తీసుకోవేం!" దర్పంగా అన్నాడు విశ్వం.

ఆ వ్యక్తి ఒక్కక్షణం విశ్వం కళ్ళలోకి చూసి తర్వాత చుట్టూ చూసి "నో థాంక్స్" అని చెప్పి గబగబ బయటికి నడిచిపోయాడు.

కొద్దిక్షణాలవరకూ ముందుకి జాచిన చేతిలోని వందరూపాయల నోటు రెపరెపలు చూస్తూ అలాగే ఉండిపోయాడు విశ్వం. అది స్వీకరించబడలేదు.

"అదేమిటండీ అంత మొత్తమా!" అన్నాడు దుకాణదారు, విశ్వంవైపు వింత చూపులు చూస్తూ.

విశ్వం ప్రత్యుత్తరం ఇవ్వలేదు.

"ఏం చూపించమంటారు?" వ్యాపారం విషయంలోకి దిగాడు దుకాణదారు.

"గాబర్డీన్ సూటింగ్ చూపించండి"

విశ్వంవైపు ఆ అమ్మాయి మళ్ళీ చూసింది యథాలాపంగా. అటువైపే చూసిన విశ్వం ఆమె ఉనికిని అప్పటికి గుర్తించాడు. ఎక్కడో చూసిన రూపం అని అతనిమనసులో లీలగా అనిపించింది. ఆలోచించగా జ్ఞప్తికొచ్చింది. తను ఇంటర్ మీడియేటు చదువుతున్నప్పుడు కాలేజీ వార్షికోత్సవాల్లో డ్యాన్సు చేస్తూ ఆ అమ్మాయి తనకి అప్పుడప్పుడు ఎదురయ్యేది! ఎవరో ఆమె! ఇప్పుడేం చేస్తోందో. పూర్వం తను చూసినప్పటికంటే ఇప్పుడు పొడుగైంది. కొంచెం బొద్దుగా కూడా ఉంది.

బిల్లు చెల్లించి విశ్వం ప్యాకెట్ తీసుకుని బయటకి వచ్చాడు. అతని మనసులో మళ్ళీ తను ధర్మం చెయ్యబోయిన దృశ్యం మెదిలింది. అతను ఎందుకు తిరస్కరించాడు? భయపడి ఉంటాడా? అంత మొత్తం అతనెప్పుడూ చూసి ఉండడేమో? పోలీసులు లాక్కుపోతారనుకున్నాడేమో? తను కావాలని అందరికీ ఎదుటా ఇస్తున్నప్పుడు భయం దేనికి? తను ఇవ్వాలనిపించిందిగా ఇవ్వలేదేమో ఒకవేళ? అంతకంటే తనేం చెయ్యగలడు ఎవరూ చూడకుండా అతని చొక్కా జేబులో పెట్టాలా? బతిమాలి తీసుకోమని నచ్చచెప్పాలా? అవసరం ఉన్నవాడే అయితే తనకేమిటి? ఏమైతేనేం, ఇప్పుడతను ఒకవేళ ఏ అఘాయిత్యం చేసినా తనకి బాధ్యత లేదు.

విశ్వానికి ఎంతకీ సంతృప్తిగా లేదు. తనేదో పొరపాటు చేశాడేమో! తనలో బహుశా ఏదో లోపం ఉండి ఉంటుంది. అకస్మాత్తుగా అతనికి ఒక విషయం తట్టింది. ఆ వ్యక్తిని ఎలాగైనా ఆ దీనావస్థనించి తప్పించి సహాయం చెయ్యాలనే దృష్టి తనలో లేదు. ఒక మంచి పనికోసం—ఒక పుణ్యకార్యం తనూ చేశాననే తృప్తికోసం తను బాహాటంగా అందరి ఎదుటా తన ఔదార్యాన్ని ప్రదర్శించాడు! సిగ్గుచేటు!

విశ్వం ముఖం మలినమైంది. ఆ వ్యక్తి తనని చెప్పుతో కొట్టినా ఇంత బాధపడేవాడు కాదు తను.

మరో ఊహకూడా వెంటనే తట్టిందతనికి. ఆ అమ్మాయి ఈ ఆర్భాటమంతా చూసి ఏమనుకుందో! తను బాగా డబ్బుగలవాడని అనుకుని ఉంటుంది. ఆ గాబర్డీన్ సూట్ తనకోసం కాదని ఆమెకి తెలియదు. పాపం ఆమె తనవైపు చూడటం తను కనిపెట్టకపోలేదు. తను ఘరానా అని ఆమెకి తెలుసో, తెలియదో!

ఉన్నట్టుండి విశ్వానికి ఓ అనుమానం కలిగింది. తను ఈ హడావిడంతా ఆమె దృష్టిని ఆకర్షించటానికి చేశాడని దుకాణంలోని వాళ్లు అనుకున్నారేమో! కొంపతీసి ఆ అమ్మాయికూడా అలా అనుకోలేదుగద!

విశ్వానికి ముచ్చెమటలు పట్టాయి. తను పొర పాటు చేశాడు. ఒక వేళ ఆ వ్యక్తి ఆ వందరూపాయల నోటు తీసుకుని ఉంటే ఉత్తి చేతుల్తో ఇంటికి వెళ్ళవలసి వచ్చేది. ఇంట్లో అడిగితే ఏం సమాధానం చెప్పేవాడు? దానిమీద ఎంత గొడవ జరిగేది! తన పరిస్థితి ఏమిటో వాళ్ళకేం అర్థమవుతుంది? ఇంకా నయం! ఆ వ్యక్తి తనకి మేలు చేశాడు కూడా, తను నోటి కోసం వెదకలేదు!

## 6

రంగనాథంగారు ఇరవై ఏళ్ళు అఖండంగా హెడ్మాష్టరు గిరీ వెలిగించి రిటైరయ్యారు. ఆయనకి విశ్వం, పద్మ, గోపీ ముగ్గురే సంతానం. కిందటి మాఘ మాసంలోనే పద్మకి వివాహం జరిగింది. ఆమె భర్త శ్రీనివాసరావు ఎం. బి. బి. ఎస్. ప్యాసై క్లాస్ ఫస్ట్ గా ఉండి అమ్మన్యతో హైదరాబాద్ లో ప్రాక్టీసు పెట్టాడు. అతడు చదువుకున్నప్పుడు విశ్వానికి అతని పరిచయం లభించింది. ఆ పరిచయమే తరవాత బాంధవ్యంగా మారింది.

ఆరోజున శ్రీనివాసరావు ప్రయాణం నిశ్చితమైంది. అనుకోకుండా పద్మకూడా అతనివెంట వెళ్తోంది ఈసారి. పెళ్ళి అయిన తరవాత అత్తవారింటికి వెళ్ళటం ఆమెకిదే మొదటిసారి. ఎవరూ తోడు కూడా వెళ్ళటంలేదు. విశ్వాన్ని ఆహ్వానించాడు శ్రీనివాసరావు కాని "కాపురం పెట్టిన తరవాత చూడటానికి వస్తాలే" అన్నాడు విశ్వం.

బండి ఎక్కబోయేముందు తల్లిదండ్రులతో పాటు తనకి కూడా నమస్కారంచేసి పద్మ సెలవు తీసుకుంటూంటే విశ్వం హృదయం ద్రవీభూతమైంది. పద్మ తనకెప్పుడూ నమస్కారం చెయ్యలేదు. అదివరదాకా పద్మని కవ్వించి, నవ్వించి అల్లరిచెయ్యటం తనకి సరదాగా ఉండేది. అదికూడా ఉక్రోషంగా అంతకంటే ఎక్కువగా తనని కవ్వించేది. అకస్మాత్తుగా, తను ఇద్దరిమధ్య ఇన్నేళ్ళనించీ అణగి ఉన్న ప్రేమభావం వెల్లువెత్తింది. పద్మ ఈరోజున తనని గౌరవిస్తోంది. దాని జీవితంలో మరో అధ్యాయం ప్రారంభమైంది. కొన్ని క్షణాలు జీవితంమీద మహా ప్రభావం కలిగిఉంటాయి. ఈ దృశ్యం తన జీవితంలో ఎప్పుడూ మరచిపోలేడు. నవ్వులాటకైనా పద్మని ఇక తను కవ్వించలేడు. వేళాకోళమైనా ఆమె చిన్నబుచ్చుకుంటే తన హృదయంలో మానని గాయం తగులుతుంది. కొన్ని సైక్తమూరంలో, మరో వాతావరణంలో పద్మ పరిస్థితుల్ని పరిశీలించుకుని జీవితం గడపాలి. తన అభిరుచుల్ని అవసరమైతే మార్చుకోటానికి సిద్ధపడాలి. ఆ క్షణంలో విశ్వం మనసులో వింతకోర్కె కలిగింది. పద్మకి జీవితకాలంలో తనేదైనా ఒక్క సహాయమైనా చెయ్యగలిగితే తన హృదయంలోని అవ్యక్తమైన ఏదో ఆరాటం, అవ్యక్తమైనబాధ తగ్గి తనకి ప్రశాంతత కలుగుతుంది.

ఈ ఆలోచనరాగానే విశ్వానికి వెంటనే నవ్వు కూడా వచ్చింది. ఆమెకి సహాయం చెయ్యాలనే కోరిక బాగానే ఉంది. కాని ఆ అవసరం పద్మకి ఎందుకు కలగాలి!

దంపతుల్ని స్టేషన్దాకా సాగనంపటానికి విశ్వం, గోపీ స్టేషనుకి వెళ్లారు. శ్రీనివాసరావు ఏదో హుషారుగా మాట్లాడుతున్నాడు కాని విశ్వం మనస్సు అంత బాగా లేదు.

గంట మోగింది. గార్డు ఈల వేశాడు. జండా ఊగుతోంది. ఇంజన్ కూత వేసింది. రైలు కదలబోతోంది.

పద్మ కేదైనా ఇవ్వాలనిపించింది విశ్వానికి. పత్రికల కుర్రాడు ఇంతలో అటువైపు వచ్చాడు. ఏవో కొన్ని పత్రికలు కొని పద్మకిచ్చాడు.

"ఎందుకన్నయ్యా ఇవన్నీ?"

"కాలక్షేపం ఔతుందిలే, ఉంచవే"

ఆ ఇవ్వటంలోని వేదన హృదయం మూగభాష ఇద్దరికీ అర్థమౌతూనే ఉంది.

రైలు కదిలింది.

"వెళ్లొస్తా బాబూ, గోపీ," అంది పద్మ గద్గదకంఠంగా.

వాడికి హృదయంలో కెలికినట్టయింది. ఎన్నిసార్లు వాడు తనేదైనా తెలియక తప్పుచేస్తే, అమాయకంగా ఏదైనా అడిగితే "వెధవా, ఫస్ట్ ఫారం వెలిగిస్తున్నావు గాని" అని దర్పంగా మందలించే వాళ్లు అక్కయ్యతప్ప ఇంకెవ్వరూ లేరని వాడికి తెలుసు. ఇంక అలా అనటానికి అక్కయ్య దగ్గర ఉండదు!

వాడి కళ్లలో నీళ్లు తిరిగాయి.

శ్రీనివాసరావు చెయ్యి ఊపాడు.

విశ్వం రుమాలు ఊపాడు

క్రమంగా రైలు దూరమైంది

గోపీ చెయ్యిపట్టుకుని విశ్వం స్టేషన్ బయటికి వచ్చాడు ఇలాంటి వీడ్కోలు దృశ్యాలని తను పూర్వం “సెంటిమెంటల్ ట్రాష్” అని తోసివేసే వాడు. ఈ రోజున అతని నేత్రాలు చెమ్మగిల్లాయి అతనేమీ ఆలోచించటం లేదు హృదయం బరువుగా ఉంది.

మార్గమధ్యంలో ఒక్కసారిమాత్రం విశ్వం, గోపీ మాట్లాడుకున్నారు

“అక్కయ్య మళ్ళీ ఎప్పుడు వస్తుందన్నయ్యా?” అన్నాడు గోపీ

“తొందరగానే వొస్తుంది.” అన్నాడు విశ్వం ఆ సమాధానం వాడికి తృప్తిగా లేదు ఉండదని విశ్వానికి తెలుసు

“ఈ దేశంలో మగవాడు తన అధికృత గజాపు చేసుకోటానికి ప్రయత్నిస్తాడు బహుశా ఎక్కడైనా అంతే కావచ్చు లేదా ఆ భేదం ఉంటే తరతమాల్లోనే! కాని, శ్రీనివాసరావు మంచివాడే” అని సమాధాన పడ్డాడు విశ్వం

ఇంటికివచ్చి భోజనాదులు ముగించుకుని తీరిగ్గా పడకకుర్చీలో పడుకుని పేపరుచూసి, చేసేపనిలేక నిద్రపోవాలని కళ్లు మూసుకున్నాడు విశ్వం కాని నిద్రవచ్చే సూచన లేదు సరదాగా మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యటానికి పక్క లేడు గోపీ ఎప్పుడూ తోటపిల్లలతో ఆడుకుంటూనో, చదువుకుంటూనో ఎక్కడో ఉంటాడు ఇక తనకి కావలసినంత తీరిక ఫలితాలు తెలిసి ఉద్యోగం ఏదైనా వచ్చేదాకా రోజంతా విశ్రాంతే ఈ సమయం వృథా పోనీయ కుండా ఏదైనా చెయ్యాలని అనుకున్నాడతను వెంటనే “జీవిత లక్ష్యం” సంగతి జ్ఞాపకం వచ్చిం దతనికి తన జీవితలక్ష్యం ఏదైతే బావుంటుంది?

బొమ్మలు వెయ్యటంలో తనకి అభిలాష కొస్తో కూస్తో ఉంది. స్కూల్లో డ్రాయింగు పరీక్షల్లో తనకి మంచిమార్కులే వచ్చేవి పక్షులూ, జంతువులూ తనకి కరతలామలకం మనుషుల బొమ్మలుకూడా కొంచెం జాగ్రత్త తీసుకుంటే బాగానే వెయ్యగలడు. చిత్రలేఖనం కృషిచేస్తే తను అందులో పేరు సంపాదించుకోగలిగేవాడు! కాని దానికి ఎంతో శ్రమ, ఓపిక, కాలమూ కావాలి తన కటువంటి ఉద్యోగం వస్తుందా! కుక్కను కూడా బొమ్మగా వేసుకోటానికి తీరిక దొరకని ఉద్యోగమైతే ఆరాధనం అవుతుంది అయినా తను విశ్వాసాన్ని కోల్పోకూడదు సాధన చెయ్యాలి. తను గొప్ప చిత్రకారుడు కావాలి

ఈ ఊహ కలగగానే దానిని ఆచరణలో పెట్టాలనే సంకల్పం దృఢమైందతనికి తన అదృష్టంకొద్దీ ఆ ఊళ్ళోనే ప్రఖ్యాత చిత్రకారుడు ఒకాయన ఉన్నాడు

విశ్వం ఆలస్యం చెయ్యకుండా ఆ సాయంకాలమే ఆయన దగ్గిరికి బయలుదేరి వెళ్ళాడు ఆ చిత్రకారుడు అదృష్టవశాత్తూ తన స్టూడియోలోనే ఉన్నాడు ఆ సమయంలో చిత్రలేఖనంలోని తన ఉబలాటమూ, కుతూహలమూ ఆయనకి తెలియచెప్పి సహాయం అర్థించాడు.

ఆ చిత్రకారుడు విశ్వాన్ని పరీక్షగా చూసి ఒక తెల్లకాగితం, పెన్సిలూ ఇచ్చి అన్నాడు

“కోడిపుంజు బొమ్మ వెయ్యండి”

విశ్వం క్షణంలో గీకేశాడు

“సున్నా చుట్టండి”

విశ్వం సున్నా అవలీలగా చుట్టాడు

“ఈ రెంటికీ తేడా ఉన్నట్టు లేదా!” అన్నాడు చిత్రకారుడు నవ్వు పెదవులలోంచి చిందిస్తూ విశ్వం చిన్నబుచ్చుకున్నాడు అతనలా తనని పరీక్షిస్తాడని తను అనుకోలేదు

“ప్రాక్టీసు చెయ్యలేదు గదండీ” అన్నాడు

“నా సలహా విని మీ రీ ప్రయత్నం విరమించు కోండి.”

“ఎందుకండీ?”

“మీకు బొమ్మలు వెయ్యటం రాదు”

అలా ఆయన కుండ బద్దలు కొట్టినట్టు నిర్మొహ మాటంగా అంటే విశ్వానికి ఆశ్చర్యంతో బాటు ఆగ్రహంకూడా కలిగింది

“నేను వేసే బొమ్మలు మా డ్రాయింగ్ మాస్టరు గారు మెచ్చుకున్నారండీ” అన్నాడు తమాయించుకుని.

"నేను డ్రాయింగ్ మాస్టర్ని కాదుగా"

"ప్రాక్టీసు చేసినా రాదంటారా?"

"ఉహుఁ. మీకు ఫ్రీ హాండ్ లేదు."

విశ్వం ముఖంలో నిరాశ కనిపించింది. 'ఇక నిటలా నిరుత్సాహపరుస్తాడేం ఈయన' అనుకున్నాడు

"ఏదైనా బొమ్మవేస్తాను, చూస్తారా?"

చిత్రకారుడు అయిష్టంగా ముఖం పెట్టాడు అది అంగీకారమే ననుకుని విశ్వం కోయిలబొమ్మ గీశాడు

"ఎలా ఉందండీ?" అని ఆశగా ఆయనవైపు చూశాడు, తప్పక మెచ్చుకుంటాడని భావిస్తూ.

అతను చిన్నగా, పొడిగా నవ్వాడు

"చిత్రలేఖనం బదులు మరేదైనా చేస్తే మీ కాలం వృధాకాదు" అన్నాడు.

"అంటేనా?"

"మీమీద నాకేమీ ద్వేషంలేదు ఫ్రీహాండ్ లేదని చెప్పాను, అంతే"

"మనిషి పుట్టగానే అక్షరాలు రాయటం రాదు కదండీ"

"అవును. ఇప్పుడా సంగతెందుకు?"

"నేర్చుకుంటే ఏదైనా వస్తుందని చెబుతున్నాను కాపీలు రాసినవాడు గుండ్రటి అక్షరాలు రాస్తున్నాడు మీరైనా ఉన్నట్టుండి అమాంతంగా ఈ విద్య మీకు వొచ్చని తెలుసుకున్నారనుకోను"

"నన్ను మీ రపార్థం చేసుకుంటున్నారు"

"అయితే క్షమించండి. కాని నా మాటలు నిజమని మీకు రుజువు చెయ్యగలను సెలవు"

ఆయన ప్రత్యుత్తిరానికి ఎదురు చూడకుండా విశ్వం చరచర వెళ్ళిపోయాడు ఆ నాటినించీ అహోరాత్రులు శ్రమపడి, పుస్తకాలు చదివి తెలుసుకుని, అభ్యాసంచేసి రేఖాచిత్రాలు సునాయాసంగా గియ్యటం నేర్చుకున్నాడు. వ్యక్తిమీద అతనికి నమ్మకం ఏర్పడింది.

ఓ రోజు సాయంత్రం మళ్ళీ ఆ చిత్రకారుడి దగ్గిరికి వెళ్లాడు

"మళ్ళీ వచ్చారే?" అన్నాడాయన విశ్వాన్ని గుర్తుపట్టి

"శిష్యరికంకోసం కాదులెండి, గురువుకోసం" అంటూ కాగితం ఆయనముందుపెట్టి ఓ కుర్చీగీసేశాడు.

"ఇదిగో మీ కుర్చీ. ఇంకా కొన్ని కావాలా? ఒకటి, రెండు, మూడు—" చిన్నవి, పెద్దవి వరసగా కొన్ని కుర్చీలు గీశాడు విశ్వం ఆయన ఆశ్చర్యంగా వాటివైపు చూశాడు

"అలా తెల్లబోకండి మరి నాకు ఫ్రీ హాండ్ లేదుగా" వ్యంగ్యంగా అంటూ వెళ్ళిపోబోయాడు విశ్వం. కటాలున చిత్రకారుడు అతని భుజంమీద చెయ్యేసి ఆపాడు చిరునవ్వు నవ్వాడు.

"శభాష్" అన్నాడు

విశ్వంకోపం ఇంకా పోలేదు

"సెలవిప్పించండి" అంటూ వెళిపోయాడు

"నిన్ను ఆశీర్వదిస్తున్నాను" అన్నాడాయన విశ్వం వెళ్ళలేకపోయాడు ఓటమిని అంగీకరించి తనని ఆశీర్వదించిన అతని సహృదయత్వం విశ్వంకాళ్ళకి బంధాలు వేసింది

"తొందరపడి ఆవేశంగా మాటాడాను క్షమించండి"

"ఫరవాలేదు. నా దగ్గిర తెలుసుకోవాలసింది ఏదైనా ఉంటే నీ ఇష్టం వచ్చినప్పుడు నిరభ్యంతరంగా రావొచ్చు చాలా సంతోషిస్తాను" అన్నాడు చిత్రకారుడు అతని హృదయ వైశాల్యం విశ్వంలో భావోద్రేకం కలిగించింది

"మహాభాగ్యం" అన్నాడు.

"వెళ్ళిరా ఇంక" సెలవిచ్చాడు చిత్రకారుడు.

తేలికపడ్డహృదయంతో విశ్వం సెలవుతీసుకున్నాడు కాఠిన్యం వెనకాలనే ఎంత మృదుత్వం ఉంటుంది! అదే ఆ కళాకారుడి సందేశం అనిపించింది విశ్వానికి

## 7

నవ్యకళాసంఘం అనే సంస్థకి ఆ రోజున ప్రారంభోత్సవం జరుగుతోంది. దానికి కార్యదర్శి రంగా రాజశేఖరుడు. స్కూల్ టీచర్. అతను

"రంగారావు గారూ, విశ్వంగారిచేత మంచి నాటకం ఒకటి రాయించాలి మీరు" అన్నాడు ఒక సభ్యుడు.

"అందులో మంచి గేయాలు తప్పకుండా ఉండాలి"

మరో సభ్యుడు తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

"థాంక్స్— కాని నాకు నాటకాలు రాయటం రాదండీ" అన్నాడు విశ్వం

"మేం నమ్మంలెండి."

"సభ్యుడివి నువ్వే తప్పించుకోవాలంటే ఎలా?" అన్నాడు రంగారావు.

"తొవారుకి దాటిన పనులు పూర్తిచేసుకుంటే ఏమవుతుందో తెలుసా?"

"అదంతా మాకు వొదిలెయ్యి"

"నాటక సంఘం నాలుగు కాలాలపాటు వర్ధిల్లాలని లేదా?"

"మంచిపాటలు చెప్పటం నువ్వు తలుచుకుంటే రాయగలవు అంతే." అన్నాడు రంగారావు. అందరూ ఆమాటే సమర్థించారు. విశ్వానికి మాత్రం గుండెల్లో రాయిపడ్డది. తనెప్పుడూ నాటకం కాదు గదా కథ కూడా రాయలేదు. ఏదో పత్రికాని వాళ్ళ మీదా, ప్రజల మీదా రుద్దితే ఫలితాల సంగతి అలా ఉంచి తనకి అపచారం చేసుకున్నవాడవుతాడు. ఏం చేయాలో అతనికేం తోచలేదు. రంగారావుతో ఈ విషయం గురించి తరవాత రెండు మూడుసార్లు ముచ్చటించాడు. అతను ఉన్న సంగతి విశదం చేశాడు.

"ఒరే విశ్వం, నువ్వు నాటకాలు చదివినవి ఎక్కువ లేవు ఉన్నాయి కూడా పాతవి" "ఉద్యోగ విజయాలు"లాంటివి మనం విస్మరించటం లేదు గదా! నాటక సంఘం శ్రేయస్సు కోరి నువ్వు నీ చేతనైనంతలో ఏదైనా రాసివ్వు, బాగుంటే వేద్దాం."

ఇక విశ్వం ఏమీ అనలేకపోయాడు. ఆలోచించి సాంఘిక నాటిక ఒకటి రాసిచ్చాడు. అందరూ 'భేష్'గా ఉందన్నారు. రిహార్సల్స్‌కి వొచ్చి సూచనలిస్తూ ఉండమని విశ్వాన్ని అడిగాడు. విశ్వం అలాగే నన్నాడు కాని వెళ్లటానికి అతనికి మనసొప్పేదికాదు. ఈ నాటకాల గొడవల్లో పడితే తన చిత్రకళాపోషణ పూర్తిగా దెబ్బతింటుంది. చిత్రకళే తన లక్ష్యం.

ఒకరోజు రంగారావు మరీబలవంతం చెయ్యటం వల్ల ఆ సాయంత్రం రిహార్సల్సుకి వెళ్లాడు.

హాల్లో ఓ మూలగది అద్దెకి తీసుకుని 'నాటక సంఘం' అని బోర్డుకట్టారు. ఆ గదిలోని వాతావరణం చూసేసరికి విశ్వానికి చిరాకువేసింది. ఉన్న సామాను చిందరవందరగా వుంది. కొంతమంది బీడీలు, మరికొందరు సిగరెట్లు తాగుతూ గది పొగతోనింపి కాల్చివేసిన పీకలు గదిలోనే పారేస్తున్నారు. సభ్యులలో కూడా ఒక క్రమశిక్షణ లేదు. ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్ళు ప్రవర్తిస్తున్నారు. తబలా ఒకపక్కన మోగుతూనే ఉంది. సభ్యులు మాట్లాడుతూనే ఉన్నారు.

"హీరోయిన్ ఎవరు వేస్తున్నారు?" అన్నాడు విశ్వం.

"వసంత అనే అమ్మాయి. అందాల బరిణె. చూస్తే గుమ్మయిపోతావు. 'ఒక్క నవ్వే పలు వజ్ర వైడూర్యాలు' అన్న కవి ఊహ నిజమని చూస్తే కాదా అనిపిస్తుంది. ఆ కళ్లూ, ఉంగరాల జుట్టూ, వాలు జడా కపోలాలూ ఓహ్!"

అతని ధోరణి మధ్యలోనే ఆపి, "నువ్వు కూడా కవివా ఏమిట్రోయ్?" అన్నాడు విశ్వం

"ఆ పిల్లని ఒక్కసారి చూస్తే కవిత్వం నురుగులు కక్కుతూ పరుగులు తియ్యదూ?"

"అదేం అలంకారం, మహాశయా?" అన్నాడు ఒక నటుడు.

అందరూ గొల్లుమన్నారు.

"నీకు పెళ్లయిందికదురా?" అన్నాడు విశ్వం

"అయితే ఏమండీ, రసపాయి మన రంగారావు" అన్నాడు ఒక సభ్యుడు. అందరూ మళ్ళీ గొల్లుమన్నారు.

"జాగ్రత్త రంగారావు చెయ్యి పట్టుకుచేవు. కఠోరాణి వజ్రాదపి"

"స్వామిభక్తా స్వామీ?" అన్నాడు రంగారావు.

విశ్వం ఈ సంభాషణకి విసుక్కున్నాడు. విషయం తప్పిస్తూ అన్నాడు

"ఆమె బాగా నటించగలదా?"

"పిచ్చివాడా! నీకు బొత్తిగా లోకజ్ఞానం లేదు. అందమైన ఆడది నటించడమెందుకోయ్ స్టేజిమీద నిలబడితే చాలదూ! కళ్ళు తెరుచుకుని చూడరూ జనం?"

"జనం సంగతి కాదు ఆమె నటన సంగతి అడుగుతున్నాను"

"నాకు బాగానే ఉంటుంది ఆమె నటన"

"ఏమండీ డైరెక్టర్ గారూ?"

"గొప్పగా నటిస్తుందండీ. మొదటి నాటకంతోటే ఆమె సినీఫీల్డులో చేరిపోతుంది లెండి. అలాంటి వాళ్ళు నాటకాల్లో 'రాట్' అవుతారా?"

విశ్వం కొంచెం ఆశ్చర్యంగా అతనివైపు చూశాడు.

"నాటకాలు వెయ్యటం 'రాట్' కావటమనా మీ అభిప్రాయం? ప్రారంభోత్సవసమయంలో నాటకకళనుగురించి గొప్పగా మాట్లాడారే!"

"నా అభిప్రాయం కాదు ఆమె దృక్పథం అదే ఐ ఉంటుంది."

"సినిమాల్లో చేరితే అంత నాజూకుగా ఉండదు లెండీ." అని విచారించాడు ఒక నటుడు

"ఎందుకండీ?" అన్నాడు చిరునవ్వుతో మరొకడు.

"తెలిసియు దలిరాకు నరుదల్ప బ్రహ్మదేవుని తరమే!"

"కవిచౌడప్ప శతకంలోని పద్యం కాదూ?"

"చంద్రరేఖావిలాపంలోదైతే మరీ రంజుగా ఉంటుంది"

"ఒరు లేయవి యొనరించిన నరవర " అని భావగర్భితంగా తలూపాడు మరొకడు.

వాళ్ళవైపు జుగుప్సతో చూశాడు విశ్వం

"ఆమె ఇవాళ రిహార్సల్‌కి వొస్తుందా?"

"ఎందుకురాదు? పిల్పిస్తున్నాంసార్"

"ఎవరైనా త్వరగా రమ్మని హెచ్చరించినస్తే బావుంటుందేమో త్వరగా రిహార్సలు మొదలుపెడితే పెందరాళే వెళ్ళిపోవొచ్చు" అన్నాడు విశ్వం.

"అందుకే కదండీ వెంకట్రావుగారు వెళ్ళారు మరొకరు వెడితే ఆయన ఒప్పుకోరు"

"ఏం?" అన్నాడు విశ్వం అర్థంకాక

"అదంతే లెండి. ఏం రంగారావుగారూ?"

రంగారావు 'హుఁ' అని ముఖం చిట్లించుకున్నాడు

"వెంకట్రావు! ఎన్నిసార్లో చెప్పాను — కొంచెం జాగ్రత్తగా ఉండమని ఎప్పుడో గాజుల చెయ్యి చెంపకుపరంబు కాకతప్పదులే"

అందరూ నవ్వారు.

"ఆమె కేసేంటి?" అన్నాడు విశ్వం

అందరూ ఒక్కసారి ముఖముఖాలు చూసుకున్నారు వాళ్ళ ముఖాల్లో ఆశ్చర్యం తాండవించింది వాళ్ళలా ఎందుకు చూస్తున్నారో విశ్వానికి తెలియలేదు.

"ఏమిటో అనుకున్నాను నువ్వూ రసికుడివే" అని రంగారావు నవ్వాడు

"ఏమిటి నువ్వనేది?"

"ఓయి మహానుభావా, ఆమె కేసేంటో ఇంతవరకూ తేలకనే చస్తున్నాం కొంచెం హైక్లాసల్లే ఉంది"

"అసలామె అటువంటిదికాదేమోనండీ చదువుకుంది కూడా."

"అవన్నీ తీసి అవతలపెట్టండి అది వంశపారంపర్యం స్వామీ"

విశ్వానికి అర్థమైంది. 'ఛీ' అనుకున్నాడు తన ప్రశ్న ఎంత క్షుద్రంగా అర్థం చేసుకున్నారు. ఆ రెండో అర్థంలోనే వాళ్ళెందుకు తీసుకోవాలి వాళ్ళ మనస్సులన్నీ కల్మషపూరితాలు ఇదా వీరి కళారాధన నాటకసంఘంటే! వెంటనే రాజీనామా పారెయ్యాలనిపించింది విశ్వానికి కాని అంతమందిలో ఆ పనిచేసి గొడవపెట్టదలచుకోలేదు రంగారావులో కూడా ఇంత నీచత్వం ఉందనుకోలేదు కళాకారుడై ఏం లాభం? ఒక వ్యక్తిని పరోక్షంలో చులకన చెయ్యటం ఘనకార్యమా? ఇంతమంది నాటకకళోద్ధారకులు ఇక్కడ కూడి చేసే పని అదేనా?

ఆమె ఎటువంటిదైనా కావొచ్చు కాని ఆర్టిస్టు. ఆ గౌరవం ఇవ్వలేనివాడు ఆర్టిస్టు అనిపించు

"మీకు మంచి పరిశీలనాశక్తి ఉందండీ"

"ఆమాత్రం దానికే! పొగడదలుచుకుని పొగుడుతున్నారు"

"మిమ్మల్ని ఊరికే పొగిడితే నాకేం లాభం!"

"నేను బాగా నటించానని మీరు మనస్ఫూర్తిగా అనుకుంటున్నారా?"

"లేక పోతే అలా అనటానికి నాకేం అవసరం!"

"మీరు మెచ్చుకుంటే చాలా సంతోషం కలిగిందండీ మీరు కోపంవస్తుందేమో గాని, మీస్నేహితులు ముఖస్తుతికోసం అలా అంటారని వాళ్ల మాటల్ని బట్టే తెలుస్తుందండీ"

"వాళ్ళు నా స్నేహితులు కారు" అన్నాడు విశ్వం ముఖం చిట్లించుకుని, హేయభావంతో వసంత ఆశ్చర్యపోయింది

"అలాగా! అయితే పొరపడ్డాను, క్షమించండీ"

"రంగారావు ఒక్కడే నాకు స్నేహితుడు రేపు కలిసాం నాచేత్తో వాడిని చివాట్లు పెడతాను" అన్నాడు విశ్వం కోపంగా

"ఎందుకు?" అంది వసంత ఆశ్చర్యంగా

విశ్వం తన పొరపాటు గుర్తించాడు తప్పున అతనికి వసంత ఇంతకుముందు అన్న మాటలు గుర్తొచ్చాయి

"ముఖస్తుతి చేస్తున్నందుకు"

"ఓ అదా!" అంది వసంత

"మరేమి టనుకున్నారు?"

"ఏంలేదులెండి"

కొంచెంసేపు మౌనంగా నడిచారు ఇద్దరూ. రిక్షా కనుచూపు మేరలో ఎక్కడా లేదు

"ఈ నాటకంలో వేస్తున్నందుకు మీరెంత తీసుకుంటున్నారు?"

"పైసా!" అంది వసంత

"ఊఁ"

వసంత కొంచెం ఆశ్చర్యపడి అంది

"నేను నాటక సంఘంలో సభ్యురాల్ని కదండీ"

"అలాగా! అయితే సరదాగా వేస్తున్నారన్న మాట"

"అవును. అదీకాక ఇదే నేను మొదటిసారి నటించబోవటం నాశక్తి ఎంతవరకుందో తెలుసుకోవాలని ఒప్పుకున్నాను"

"పేరువస్తే ఏం చేస్తారు?"

"వీలైతే సినిమాలో చేరాలని ఉంది" అంది.

విశ్వం ఏమీ మాట్లాడలేదు ఆ సమాధానం ఎందుకో అతనికి రుచించలేదు. వసంత మనసులో ఉన్నది మర్మంలేకుండా చెప్పే అమాయకురాలని గ్రహించాడు. నాటకసంఘంలోని వాళ్లందరూ ఆ క్షణంలో ఓ నేస్తాలా అతని మనోవీధిలో కదిలించారు. అతనిహృదయం ఆరాటపడ్డది

"నాటక సంఘంలో కొంచెం జాగ్రత్తగా ఉండండి"

"ఏం?" అంది వసంత ఆసక్తిగా అతనివైపు చూస్తూ.

"వాళ్ళలో కళారాధకులంటే పాడుబుద్ధులే ఎక్కువ" అన్నాడు విశ్వం కాని వెనువెంటనే తొందరపడి అలా వాళ్ళమీద అభిప్రాయం వెలిబుచ్చినందుకు చింతించాడు ఈ విషయాల్లో తనెందుకు అనవసరంగా కల్పించుకోటం? కొంపలోకి దిగజారెడు

వసంత ఏదేదో ఆలోచిస్తూ నడుస్తోంది ఆమె తెలివితక్కువ దేమీ కాదు ప్రపంచం పోకడలు తెలియనిదీ కాదు నాటకసంఘంవాళ్ళ బుద్ధులు పసిగట్టలేకపోలేదు కూడా కాని ప్రత్యేకించి విశ్వం అలా ఎందుకు హెచ్చరించాడో ఆమెకి అర్థం కాలేదు కవిగారు అంటీ అంటనట్టుగా మాటాడుతున్నారు నాటక సంఘంలో మిగతా వాళ్ళకి మల్లే కాక కవిగారి మాటల్లో ఆమెకి హుందాతనం, ఆదరణా కనిపించాయి. వందరూపాయలు ఊరికే వొదులుకోవటంలో నే తనకి అతనుమనసు మంచిదని తెలిసింది.

రిక్షావీధి ఎదురుగుండా వస్తోంది ఖాళీగా.

"ఇంక రిక్షా ఎక్కండి"

"ఇంకెంతో దూరం లేదండీ మా ఇల్లు. ఇప్పుడు రిక్షాగనికి వడిచేదవాను" అంది వసంత వశేశ్వరావైతే తను గర్వాలో విడిచారంటే "సరదాగా నడిగి వెడదామండీ" అనేవాడు ఆ వశేశ్వరావుని చూస్తుంటే తనకి ఒక్కొక్కసారి అరికాలిమంట నెత్తికెక్కుతుంది కొంచెం జాగ్రత్తగా మసులుకోమని చెప్పాలి

"మీరు బి. ఏ ఆనర్స్ ప్యాసయ్యారా?" అందామె

"ఇంకా లేదు పరీక్షకి వెళ్లాను ఫలితాలు రాలేదు"

"ప్యాసయినరోజున మీకు నేను టీపార్టీ ఇస్తాను. ఏమంటారు?"

"థాంక్స్ రెడీ" అన్నాడు విశ్వం నవ్వుతూ

మాటలసందడిలో ఎంతదూరం నడిచింది తెలియలేదు వాళ్లిద్దరికీ ఆకస్మాత్తుగా వసంత ఆగి అంది

"ఇదేనండీ మా ఇల్లు ఇంక వెడతాను"

"మంచిది" అనేసి విశ్వం ముందుకి సాగిపోయాడు లోపలికి నడుస్తూ వసంత నాలికొరుక్కుంది తను ఇన్నిమాటలు మాట్లాడినా నాటిక గురించి ఒక్కముక్కయినా అనలేదు తను వొట్టి మతిపిస్సిది ఏమనుకున్నారో కవిగారు!

(సశేషం.)

# నూతనగ్రహముల ఫలప్రదత్వము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

జాతక ముహూర్తాదులలో నూతన గ్రహములకు ఇంద్ర వరుణ యములకు సహితము కొంత ఫల ప్రదత్వము కలదని సోదాహరణముగా చూపుటకు ప్రయత్నించుచున్న నా వ్యాసములు సనాతన సంప్రదాయ ధురంధరులకు హోరాశాస్త్రవేత్తలు కొందఱికి రుచించినవి కావు మంచిదే. లోకము భిన్నరుచి. ఆగ్రహముల గొడవ లేకయే, ఏ సమస్యనైనా, నిర్వహించుట సాధ్యమని వారి విశ్వాసము. అట్లే వారు నిర్వహించి కార్యకారణ సమన్వయము చేయుచున్నారు కూడా సంతోషమే వారిని ఆధిక్షేపించు శక్తి నాకు లేదు అట్టిపని అవసరము నహి

కాని, నూతనగ్రహములను జాతక చర్చలో నుపయోగించుట పూర్వులగు మన ప్రాచీన మహర్షుల పట్ల కృతఘ్నతము కాని మహాపరాధ మగునని, ఆంగ్లభాషలో విజ్ఞానశాస్త్రమున ఆచార్యపటము వహించిన ఒకానొక జ్యోతిశ్శాస్త్రవేత్త ఇటీవల నా కొక లేఖ ననుగ్రహించినారు ఆ మహాపరాధమేమో తోచకపోవుటే నా బాధ

మన దేశములో జ్యోతిశ్శాస్త్ర సూత్రములను నిబంధించినవారు వశిష్ఠాది మహర్షులు వారు యోగసిద్ధులు, త్రికాలవేత్తలు. వారు చెప్పనియే విషయముగాని అసమగ్రముగా చెప్పినవారు కాగా ఈ నూతన గ్రహములను వారు సూచించియుండలేదు వానికి ఫలప్రదత్వ మున్నదని వారు చెప్పనూలేదు. అట్టిచో, ఈ నూతనగ్రహములకు సయితము ఫల మున్నదని మన మంగీకరించి జాతకచక్రములలో వాని నుపయోగించితిమేని, ఆ మహర్షులకు ఏని విషయము తెలిసియుండలేదని సిద్ధాంతీకరించినట్లగుటచే, ఆ మహనీయులకు అజ్ఞతను ఆరోపించి వారిపట్ల గొప్ప అపరాధము చేసినట్లగును కదా? మన మహర్షుల మతమును తిరస్కరించి భిన్న సంప్రదాయముల నవలంబించుట ఘోరపాతకము కాదా?

ఆ పండితుని దృష్టి ఇది. అతని దృక్పథముతో చూచితిమేని, ఈ యభిప్రాయము సాధువనియే చూపట్టు ననుటకు సందియము లేదు. మహనీయులగు మన ప్రాచీన మహర్షుల యోగశక్తి ప్రపంచమున నిరుపమానమయినది వారి గౌరవమునకు, జ్ఞానమునకు, న్యూనత వాటిల్లచేయుట కృతఘ్నము కాని యపరాధమే యగును. అట్టి అకార్యమునకు ఎన్నడు గాని పూనకొనను కాని, యీ రకపు విమర్శకుల సిద్ధాంతములో ఒక్క విశేషమున్నది బుద్ధిపూర్వకముగనో, లేక అనిచ్ఛాకృతముగనో, చెప్పలేము కాని, రెండు విషయములను వారు నిశ్చయముగా విశ్వసించియున్నారని స్పష్టమగుచున్నది ఏమందురా? మొదటిది, మన మహర్షులు జ్యోతిశ్శాస్త్ర సందర్భమున చెప్పిన సూత్రము లన్నియు తమ కిపుడు లభ్యమైయున్నవనుట. రెండవది, ఆ లభించిన సూత్రము లన్నియు తమకు అర్థమయినవనుట ఏమో కాని, క్షమింపుడు, నా దృష్టిలో పై రెండును సందేహాస్పదములే

జ్యోతిశ్శాస్త్ర సూత్రములను నిబంధించిన మన ప్రాచీనులు పదునెనమండుగురు మహనీయులని మన గ్రంథములు చెప్పుచున్నవి.

"సూర్యః, పితామహో, వ్యాసో,
వశిష్ఠో, ఽత్రిః, పరాశరః,
కాశ్యపో, నారదో, గర్గో,
మరీచి, ర్మను, రంగిరాః,
లోమశః, పౌలిశ శ్చైవ,
చ్యవనో, యవనో, భృగుః,
శౌనకో, ష్టాదశ హ్యేతే
జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకాః" అని

వీరు ఏమేమి గ్రంథములు రచియించిరో, అవి అన్నియు మన కిపుడు లభ్యమై యున్నవని చెప్పగలమా? వీరందరు మహర్షులే వీరిలో ఒకరు చెప్పిన అంశమునే పదములో, తిలకల్లో, మార్పి ఇతర మహా

టయ్యా! అన్నిటికీ సహించిన ఆ రూరాజా కొడుకు రాదేలావు ?”

ఆమె రొప్రగించి చూసింది. శరీరమంతా పాప వంలో మునుకుపోతూంది. “నాకు పిశ్శైనా తెలీదు నాకు తెలిసినవాడు అగుగో వాడొక్కడే మీ రంతా పొండి పోతారాలేదా ?” ఆమె కసిరి వేసింది ఆమె నిప్పులు కక్కుతూంటే పిచ్చయ్యన్న కూడా గుర్రిపడి భయపడ్డాడు ఆ ముదుసలి గంభీరమైన గొంతుక మళ్ళీ వినిపించింది. “ఓ అమ్మా! ఇప్పుడు ఒళ్లు బింకంతో వున్నావు నీకేమీ తెలిసిరాదు దేవుడూ లేడు! నీతి లేదంటావ్ కాస్త వాడిపోగానే నీదరికి పిడూ చేరదు ఎక్కడో మారుమూలల్లో గతిలేక వచ్చి నక్కలచేత, కుక్కలచేత, రాబందులచేత పీకించుకుంటావ్ ?”

“నేను చచ్చాక నాకేమిటే నీకేం ? నేను చూడొచ్చానా ? నాకు పిచ్చయ్యన్నతోనే బ్రతుకూ చావూనూ! వాడి చేతులతో నన్ను పొడిచినా నేను సంతోషంగా చచ్చిపోతాను ఈ లోకంలో వాడొక్కడు తప్పించి నాకింకెవరూ లేరు.”

అంటూ ఆమె ఆక్కడనుంచి గబగబ కదిలి పోయింది చుట్టూ మూగినవాళ్లు ‘ఛీ ఛీ’ అన్నారు తుప్పున వూశారు “అది మనిషి కాదు పసువు!” అన్నారు “దానికైనా కొంత సిగ్గుంటాది దీనికి లేదన్నారు నానాదుర్భాషలూ ఆడారు. ఒక మూల తలపట్టుకొని కూర్చుండిపోయిన యజమానిని చూడ గానే పిచ్చయ్యన్న దగ్గరగాపోయి కాళ్లు పట్టుకొని బల బలా ఏడ్చేశాడు.

“నా నౌకరుగా వుండొద్దు నాతో సరిసమానంగా వుండు” అన్నాడు పిచ్చయ్యన్న గద్గదమన్నాడు అతని పాదాలొత్తడానికి పనికొస్తానేమో యెన్ని అంతస్థులు లేదా!

“నీకు కొంతపొలం యిస్తాను. దున్నుకొని హాయిగా బ్రతకండి!”

ఈ మాటలు సంతోషంతోపాటు భయాన్ని కూడా రేకెత్తించాయి. ఎందుకో గుండె దడపట్టుకుంది యీ భూమి యిచ్చి తన పిల్లాపాపతో బ్రతకమనలేదే! ఈమెతోనా ? ఈ రాయితోనా తన కాపరం ? వద్దని చెప్పబోయాడు చెప్పలేకపోయాడు. అంతదూరంలో వున్న ఆమెను చూడగానే తనకు భయం వేసింది. కసిరి చూచినట్లుయింది మెల్లిగా నిల్చు న్నాడు “రండి! ఇద్దరూ బండియెక్కండి” అన్నాడు ఆ గంభీర కంఠ స్వరాన్ని పాటించే అల వాటుకొద్దీ పిచ్చయ్యన్న బండివేపు నడవగానే ఆమె ఆపడానికి పరుగెత్తుకు వచ్చింది “వద్దు వద్దు మళ్ళీ ఆ నరకానికి వెళ్లొద్దు మనం ఇక్కడే యిలాగ వుండిపోదాం ఒక్కసారి యిద్దరు ఇక్కడే చచ్చి పోదాం!”

ఆమె ధాటికి పిచ్చయ్యన్న జంకిపోయాడు కాళ్లు కట్టేసినట్లు నిల్చుండిపోయాడు ఆమె భర్త ఒకసారి ఆమెవేపు ఎగాదిగా చూశాడు ఆమె శరీరం జలద రిస్తోంది కోపంలో కంపిస్తోంది మతిచెడిన మనిషిలా కొద్దిగా పిచ్చిచేష్టలు అగపడ్డాయ్. అంతమందిలో పిచ్చయ్యన్న చెయిపట్టి లాగే ఆమె సాహసాన్ని చూసి పౌరుషాన్ని అపుకోలేకపోయాడు. బిగ్గరగా “వాణ్ణి త్రాళ్లతో కాళ్లు చేతులూ కట్టి బండిలో వెయ్యం”డని హుకుం జారీ చేశాడు

ఆ ఆజ్ఞ అరనిమిషంలో శిరసావహించడం జరి గింది బండి కదిలిపోతోంది ఆమె యెంత గుంజాటన పడినా లాభం లేకపోయింది ఊళ్లోవాళ్లు వున్న సామానులు బయట పడవేసి “నీలాంటి నీచురాలు మా వూళ్లో వద్దని కేకలు వేశారు ఆమెకీ కేకలేవీ విని పించలేదు బండి వేగంగా పరుగెత్తింది కొంత దూరం పోయాక భర్త బండి ఆపించి “మీదికి రా!” అన్నాడు

“నేరాను పిచ్చయ్యన్న కట్లువిప్పు . ఎక్కడికో పోతాం!”

మళ్ళీ బండి తోలించాడు ఎంత బ్రహ్మాండమైన కొండ పొలాల క్రోతలోనుంచి యెడ్లబండి పరుగు తీస్తోంది ఆమె కాళ్లు బొబ్బ లెక్కిపోయాయి, స్నానం చేసినట్లు చెమట కారుతోంది. దాహం బ్రహ్మాండంగా వుంది కాళ్లు పట్లుతప్పి పీకుతు న్నాయ్ శరీరమంతా కందిపోయింది విరబోసిన జుత్తుతో వున్నకొద్ది కక్షతో బండివేగం పరుగెత్తు తోంది .. అదిగో ఊరు! ఒళ్లు స్వాధీనంతప్పతోంది, ఎదురుగా బండి రెండు బళ్లుగా అగపడి . మసక మసగ్గా అగుపించి. ఒక్కసారి మాయమైపోయింది బండి ఆగింది మెలకువ మూర్ఛపోయిన రాజమ్మను బండిమీద వేశాడు. నీరు చల్లాడు. ఆమెకు తెలివిచ్చే

# కౌటిల్యుని అర్థశాస్త్రము

శ్రీ పి. వరహాలరావు

ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్ర చరిత్రలో కౌటిల్యుని అర్థశాస్త్రం అత్యంత ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తుంది. కౌటిలీయం, మన రాజనీతి శాస్త్రంపాలిట మహోన్నత భాండాగారం. దీన్ని రచించినవాడు కౌటిల్యుడు లేక చాణక్యుడు. ఇతడు తక్షశిలానగరంలో జన్మించాడని కొందరు, ద్రవిడ దేశస్థుడని మరికొందరు ఊహిస్తున్నారు. ఇతడు ఆంధ్రుడనే ప్రవాదంకూడా ఉంది. ఏది ఏమైనా, ఈయన జన్మస్థానం ఇది అని చరిత్రపండితులు నిర్దిష్టంగా తేల్చలేదు. ఈయన వేదవేత్తయే గాక నాటికాలపు విద్యలన్నిటినీ, సమగ్రంగా అభ్యసించిన వాడు. తక్షశిలావిశ్వవిద్యాలయంలో విద్యార్థిగావున్న దినాల్లోనే కూటముద్రలు (దొంగ నాణెములు) తయారుచేసేవాడనీ, 'కుంటనక్క'వంటి తెలివి తేటలుగలవాడనీ ప్రతీతి "ముద్రారాక్షస" నాటక కర్తయిన విశాఖదత్తుడు "కౌటిల్యః కుటిలమతిః" అని ఒక పాత్రచే యీయన శీలాన్ని అభివర్ణింపజేశాడు

కౌటిల్యుడు "అర్థశాస్త్రాన్ని" క్రీ పూ 300 ప్రాంతాల రచించి వుంటాడు కాంతిలోకి వచ్చిన నాటినుండీ యీ మహాగ్రంథం కీర్తి చంద్రికలు, సూర్యకిరణాల్లాగ దశదిశలా వ్యాపించాయి. క్రీ శ. 8 వ శతాబ్దంలో జీవించిన కామందకుడు తన "నీతిసారం"లో కౌటిలీయ ప్రాశస్త్యాన్ని వేనోళ్ళ ప్రశంసించాడు శాస్త్రాంబుధిలోనుండి కౌటిలీయమనే రాజనీతి శాస్త్రామృతాన్ని ఉద్ధరింపజేసిన మహోన్నత ప్రతిభాశాలిగా కౌటిల్యుణ్ణి వర్ణించాడు క్రీ శ 8 వ శతాబ్దంలో జీవించిన భవభూతి తన 'మహావీరచరిత్ర'లోను, భవభూతికి 50 సంవత్సరాలకు పూర్వమున్న మహాకవి దండి తన 'దశకుమార చరిత్ర'లోను, క్రీ శ 6 వ శతాబ్దంలో వ్రాయబడిన 'నారదస్మృతి'లోను, కౌటిలీయార్థశాస్త్రం ప్రస్తావించబడడం గమనార్హం న్యాయభాష్యము క్రీ శ 850 లో వ్రాయబడిన 'యాజ్ఞవల్క్యస్మృతి'లాంటి ధర్మశాస్త్రగ్రంథాలు, మేధాతిథి, మల్లినాథుడూ వంటి సుప్రసిద్ధ వ్యాఖ్యానకారులూ, కౌటిలీయాన్ని పేర్కొన్నారు ఇంతమంది మహామేధావుల, ఉద్దండ పండిత ప్రకాండుల దృష్టి ఆకర్షించిన యీ గ్రంథం కొంతకాలం అదృశ్యమైపోయింది

మౌర్యచంద్రగుప్తుని ఆస్థానంలోవున్న గ్రీకు రాయబారి మెగస్తనీసు, తన 'ఇండికా' గ్రంథంలో చంద్రగుప్తుని గూర్చి వివరముగ సమాచారాన్ని అందించి, మౌర్యసామ్రాజ్యాన్ని స్థాపించి, చంద్రగుప్తుని ప్రధానామాత్యుడుగావుండి, దైనందిన రాజ్యకార్య నిర్వహణలో పాల్గొనిన కౌటిల్యుని పేరును పేర్కొనకపోవటం నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే! దీన్ని ఆధారంగా చేసికొని, కొందరు పాశ్చాత్య, భారతీయ పండితులు కౌటిల్యుడు పుక్కిటి పురాణానికి చెందిన వ్యక్తి అనే నిర్ణయానికి వచ్చారు ఐతే వారి సందేహాలు, నిర్ణయాలు, నిరాధారాలని చరిత్ర రుజువుచేసింది.

కొన్ని శతాబ్దాలాదిగా ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రం పాలిట కామధేనువులా ఉన్న 'అర్థశాస్త్రం' కొంతకాలం మరుగునపడిపోయి, 20 వ శతాబ్ది ప్రారంభంలో, 1900 ప్రాంతాన డాక్టరు శ్యామ శాస్త్రిచే కనుగొనబడింది ఆయన యీ గ్రంథంలోని కొన్ని భాగాలు ఇంగ్లీషు భాషలోనికి అనువదించి ప్రచురించారు దాంతో యూరపియన్ పండితులు, ప్రత్యేకంగా జర్మన్ సంస్కృత విద్వాంసులు, దీన్ని అధ్యయనం చేసి పరిశోధనలు ప్రారంభించారు అంతదాకా, ప్రాచీన హైందవులకు స్వతంత్ర అర్థశాస్త్రమంటూ, ఒకటి లేదని ప్రచారం చేసిన యూరపియన్ పండితుల దృక్పథంలో కౌటిలీయ పునర్దర్శనం విప్లవాత్మకమగు మార్పును తీసుకువచ్చింది. అంతేగాక, కౌటిలీయానికి పూర్వము, తదనంతరము ఎన్నో రాజనీతిగ్రంథాలు వ్రాయబడ్డాయి. అవన్నీ కౌటిలీయంలా, ఏదో ఒకనాడు వెలుగులోకి రాకుండా మానవని ఆశిద్దాము.

కౌటిల్యుడు 'అర్థశాస్త్రాన్ని' రచించేందుకు సూత్రశైలి ఉపయోగించాడు. అందుచేత, ఆయన అభిప్రాయాలు అతినిగూఢంగా కన్పిస్తాయి గ్రంథంలో ఉపయోగించిన పరిభాష, తక్కిన సంస్కృతగ్రంథాల్లో గానీ, నిఘంటువుల్లో గానీ కన్పించదు కౌటిల్యుని పిదపవచ్చిన గ్రంథకర్తలు ఎవ్వరూ ఆయనలా రాజ్యపాలనకు సంబంధించిన విషయా

లన్నిటినీ విపులంగా వివరించలేదు. కౌటిలీయంలో ఉన్న అన్యత్ర ప్రచార ధర్మస్థీయ యోగవృత్తాది అధికరణాలను కూర్చిన ప్రకరణాంశంలేవీ కామందకుని "నీతిసారం"లో గానీ, శుక్ర "నీతిసారం"లో గానీ లేవు కాబట్టి రాజ్యాంగతంత్రం గూర్చి ప్రాచీన శాస్త్రవేత్తలు చేసిన సిద్ధాంతపరంపరానికి కౌటిలీయమే ప్రధానమైన ఆధారం

కౌటిలీయం అవతరణ కాలంనాటికి భారతదేశంలోని విభిన్నపరిస్థితులు అస్తవ్యస్తంగా తయారయ్యాయి మాసిడోనియా దేశస్థుడయిన అలెగ్జాండరు, ప్రపంచాన్ని జయించాలనే వాంఛతో జైత్రయాత్ర ప్రారంభించాడు పారసీక సామ్రాజ్యాన్ని తన పాదాక్రాంతం చేసికొని, హిందూకుష్ పర్వతాలు దాటి, క్రీ పూ 326 లో భారతదేశంపై దండెత్తాడు ఆ నాటికి, ఉత్తర భారతదేశంలో చిన్న చిన్న రాజ్యాలు అసంఖ్యాకంగా వున్నాయి అనాయకులై, నిరంతరం కలహాంతిప్ప మరో వ్యాపకంలేని రాజులు, భోగభాగ్యాలనుభవిస్తూ, బతుకున్న రోజులవి పంజాబ్ చిన్న చిన్న భాగాలక్రింద చీలిపోయింది దేశం ఐక్యము, క్షేమము మరచి, విదేశశత్రువు దేశ స్వాతంత్ర్యాన్ని దొంగిలించ సిద్ధపడ్డప్పుడుకూడా, నాటి క్షుద్రులైన రాజులు, (పురుషోత్తముడు వంటి రాజులు తప్ప) పరస్పరం కుత్తుకలు త్రెంచుకొనే యత్నంలో ఉన్నారు అలాంటి పరిస్థితులలో అలెగ్జాండరు దండెత్తాడు అలెగ్జాండరు దండయాత్ర భారతదేశ రాజకీయాకాశాన్ని తాత్కాలికంగా ఆవరించిన కారుమేఘం ఇది వెంటనే అదృశ్యమైంది

గ్రీకు దండయాత్ర కొన్ని సత్ఫలితాలనూ కొన్ని దుష్ఫలితాలనూ కూడా కలుగజేసింది గ్రీకు దండయాత్రా ఫలితాలు, హిందూసంఘం ఆచార వ్యవహారాలను కొంతవరకు కళంకితం చేశాయి. కొందరు రాజవంశస్థులు, గ్రీకు సేనాధిపతులకు తమ కన్యలనిచ్చి వివాహ మొందారు. మౌర్య చంద్రగుప్తుడు, సెల్యూకస్ కూతురును వివాహమాడాడు దీని ఫలితంగా హిందూ సంఘంలో వర్ణసాంకర్యం ప్రారంభమైంది వైదిక మతానికి దుర్దశ ప్రాప్తించింది నాటి కాలంలో, దేశంలో జైన బౌద్ధాలు ప్రజాభిమానాన్ని చూరగొన్నాయి కౌటిల్యుని కాలం నాటికి, మగధ రాజ్యాన్ని నవనందులు పాలిస్తున్నారు నందులలో చివరివాడైన ధననందుడు ప్రజాద్రోహిగా తయారై, ప్రజల్ని హింసించడం జరిగింది అలాంటి పరిస్థితులలో, ప్రజాకంటకంగా తయారైన నందరాజులపాలన ముదముట్టింప చేసి, వైదికమతాన్ని పునరుద్ధరించేందుకు, కౌటిల్యుడు కంకణం కట్టాడు. మహామేధావి చంద్రగుప్తుడు, అనన్య సామాన్య ప్రతిభాశాలి, అఘటనఘటనా రాజనీతి శాస్త్రపారంగతుడైన కౌటిల్యుడూ కలిసి, ప్రచండమైన సైన్యాన్ని సమకూర్చి, నందులను ఓడించారు మగధరాజ్యాన్ని వశపరచుకొన్నారు ప్రాచీన హిందవ రాజకీయాకాశంలో మిణుకు మిణుకు మంటూ, అప్పుడప్పుడు దివ్యకాంతిలో ప్రకాశించిన ఆదిమ గణ సంఘాలు కాలక్రమేణా మౌర్య సామ్రాజ్యంలో సైనిక శక్తి సహాయంతో కబళించి వేయబడ్డాయి. ఈ విధంగా భారతదేశ చరిత్రలో, మొట్టమొదటిసారిగా, సువిశాలమైన మౌర్య సామ్రాజ్య అవతరణం జరిగింది.

## కౌటిల్యుడు . వైదికధర్మపరత్వం

కౌటిల్యుడు వైదికమతం పై అధిక తరమయిన అభిమానం చూపాడు ఇతని వైదిక ధర్మ పరత్వానికి కౌటిలీయార్థశాస్త్రంలోనే ఎన్నో నిదర్శనాలున్నాయి. కామందకుడు కౌటిల్యుని శాస్త్ర పాండిత్యాన్ని, వైదిక ధర్మపరత్వాన్నీ, అసాధారణ ప్రతిభనీ యీ విధంగా ప్రశంసించాడు

"వంశే విశాల వంశ్యానాం ఋషీణామివ భూయసాం
అప్రతిగ్రాహకాణాం యో బభూవ భువి విశ్రుతః
జాతవేదా ఇవార్చిష్మాన్ వేదాన్ వేదవిదాం వరః
యోఽధీతవాన్ సుచతురః చతురోఽప్యేక వేదవత్
యస్యాభిచార వజ్రేణ వజ్ర జ్వలన తేజసః
పపాత మూలతః శ్రీమాన్ సుపర్వానందపర్వతః
ఏకాకీ మంత్రశక్త్యాయః శక్త్యా శక్తిధరోపమః
ఆజహారన్నృచంద్రాయ చంద్రగుప్తాయ మేదినీమ్
నీతిశాస్త్రామృతం ధీమాన్ అర్థశాస్త్రమహోదధేః
సముద్దధ్రే నమస్తస్మై విష్ణుగుప్తాయ వేధసే"

అప్రతిగ్రాహకమైన ఉత్తమ ఋషి వంశంలో వుద్భవించి, అగ్నిలో నాలు వేదాలనీ ఒకే వేదంలా అధ్యయనం చేసి, సర్వశాస్త్ర నిష్ణాతుడై, పవిత్ర జీవనమున యాగాగ్నిలా ప్రకాశించి, అర్థ ధర్మ రక్షణకొరకు విదేశ విజృంభణాన్ని అరికట్టి, అద్భుత మంత్ర సామర్థ్యంతో, నందపర్వతాన్ని, గుహ సేనానిలా ఒంటరిగానే శక్తితో నిర్మూలించి, మౌర్య చంద్రగుప్తునికి చక్రవర్తిత్వాన్ని సాధించి, అర్థశాస్త్రాంబుధినుండి నీతిశాస్త్రామృతాన్ని పుష్కరింపజేసినమహోన్నత ప్రతిభాశాలిగా, కౌటిల్యుణ్ణి, కామందకుడు ప్రశంసించాడు. వైదికధర్మరక్షణ, మౌర్యసామ్రాజ్య స్థాపన తత్పరిపాలన ఇవే కౌటిల్యుని ప్రధానాశయాలు అందుకే తాను రచించిన అర్థశాస్త్రంలో వేదాలకు, చాతుర్వర్ణ్య చతు

చేస్తాయని పూర్వ పండితులు తలచి, ఆయనపై కత్తులు నూరారు. కౌటిల్యుడు రాజ్యపాలనా సౌష్ఠవాన్ని పటిష్ఠం చేసేందుకు ప్రవేశపెట్టిన సంస్కరణలు, సూచించిన మార్గాలు ప్రాచీన ధర్మశాస్త్రవేత్తల యాంత్రిక సూత్రాలకు వ్యతిరేకంగా తయారయ్యాయి. కనుక కంటకాలు నివారించేందుకు, రాజ్యంలో విప్లవం, శత్రుదండయాత్ర, మొదలైన అత్యవసర పరిస్థితులు హఠాత్తుగా సంభవించినప్పుడు, ప్రభుత్వ కోశంలో ధనం లేకపోతే సంపన్నులనుండి బలవంతంగా డబ్బు గుంజడం, గుర్వాంగాల పొలాలను బల ప్రయోగంతో స్వాధీనం చేసుకోవడం, ప్రజల మూఢ మత విశ్వాసాలను ఆసరాగా తీసుకొని అధర్మమార్గాల ద్వారానైనా ధనం సంపాదించడం - యివి రాజ్యం యొక్క శాంతి భద్రతల దృష్ట్యా, సుస్థిరత దృష్ట్యా అత్యవసరమని కౌటిలీయంగా స్పష్టంగా ప్రతిపాదించాడు. కాని ధర్మశాస్త్రకారులు యీ ప్రతిపాదనలపై విరుచుకుపడ్డారు.

ధర్మగ్లాని కలుగుతుందని, కారాలు మిరియాలు నూరారు. ఐనా వారి విమర్శలకీ, ఆ కాలపు కాలుష్యానికీ యినుమంతైనా లెక్క చేయకుండా వల్లెగూపై బండిని తోలినట్లు తన మార్గాన తాను ప్రయాణించాడు చాణక్యుడు!

వాస్తవిక రాజకీయరంగంలో అధికార స్థానంలో వుండేవారు ఎలా వ్యవహరిస్తారో కూడా విశదీకరించాడు. ఈ ప్రకృత సత్యయుక్తమూ, ధర్మబద్ధమూ అనే మాటలకు అతడెట్టి ప్రాధాన్యం యివ్వలేదు. శత్రువులను ఓడించడంలో మోసం, అసత్యప్రచారం, కుట్రలూ కుతంత్రాలూ,— యిలాంటివన్నీ ఉపయోగించదగిన సాధనాలని కౌటిల్యుని అభిప్రాయం. ఈ సందర్భంలో ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారి అభిప్రాయాన్ని ఉల్లేఖిస్తాను: "చాణక్యుని ప్రపంచము వాస్తవిక ప్రపంచముగాని, ఆదర్శ ప్రపంచముగాదు. రాజులు ఎట్టి మార్గముల ననుసరించు చుండెనో వివరించుటయే అతని ఉద్దేశ్యము. న్యాయాన్యాయములు, ధర్మాధర్మములు విధించుటకు అతడు ప్రయత్నించుటలేదు. అతని గ్రంథమును, అందులోని సూత్రములను విమర్శించువారు ఈ విషయమును జ్ఞాపకముంచుకొనవలయును. శత్రువును మోసపుచ్చి ఓడించుట న్యాయమా అన్న విషయమును అతడు విచారించుటలేదు. శత్రువును వంచించి జయించుట సర్వసాధారణమని నిరూపించుటయే అతని ఉద్దేశ్యము."

ఉత్తమ లక్ష్యమును పొందుటకు వక్రమార్గాన్నైనా అనుసరించాలని అతని మతం. రాజ్యభద్రతకు, సుస్థిరతకు ఘోరవిపత్తు వాటిల్లినప్పుడు, శత్రువును ఎదుర్కొనుటకు డబ్బు అవసరమైతే, అధర్మము, వక్రమూ, దౌర్జన్యయుతమూ ఐన మార్గం ద్వారా సంపాదించినా తప్పులేదని అతడంటాడు. దీనికి ఉదాహరణ యిచ్చాడు. ఒక గోవును కసాయి వెంటాడుతూ తరుముకొని వచ్చాడు. ఆ ఆవు పారిపోయి వచ్చి ఒక పరమ సత్యవ్రతుని ఆశ్రమంలో దాక్కున్నది. వెంటాడు పరుగెత్తుకొని వచ్చి "ఆవు యీ దారిన పోయిందా?" అని అడిగితే, సత్యాన్ని చెప్పి గోవును కసాయి కత్తికి అప్పగించాలా? లేక అసత్యం పలికి దాన్ని రక్షించాలా? ఆ సమయంలో ఎంతటి సత్యవ్రతుడైనా, అబద్ధమాడైనా ఆవును రక్షించడం ధర్మం, న్యాయం — అంటాడు కౌటిల్యుడు. 100 అబద్ధాలాడైనా ఒక పెళ్ళి చేయమనే సామెత విన్నమాట! ఉత్తమ సాధ్యాలను అధమ సాధనాల ద్వారానైనా సాధించవచ్చు, సాధించాలి అని అంటూ ఈ ప్రతిపాదన పథంలో నడిచినవాడు, 19వ శతాబ్దంలో జీవించి, జర్మన్ సామ్రాజ్య వాదానికి పునాదులు వేసిన అనన్య సామాన్య రాజనీతిజ్ఞుడు బిస్మార్క్. అంతకు పూర్వం క్రీ.పూ. 4వ శతాబ్దంలోనే, మగధలాంటి అతి చిన్న రాజ్యాన్ని తన యుక్తిచే, ప్రజ్ఞచే దిగంత విశ్రాంతమైన మౌర్య సామ్రాజ్యంగా విస్తరింపజేసిన మహోన్నత ప్రతిభాశాలి కౌటిల్యుడు.

## మేక్ వెల్లి

సాధ్యాలు సాధనాలను సమర్థిస్తాయి అనే సిద్ధాంతాలను ప్రతిపాదించిన మరో రాజకీయ తత్త్వవేత్త—ఇటాలియన్ దేశీయుడైన నికోలో మేక్ వెల్లి. అతడు "ప్రిన్స్" (Prince) అనే ప్రసిద్ధ ప్రఖ్యాత గ్రంథం రచించాడు. రాజులు తమ కర్తవ్యాన్ని చేయుటకు, తాము వాంఛించిన లక్ష్యాన్ని సాధించేందుకు ఎలాంటి కుట్రలనైనా చేయవచ్చుననీ, మోసాలు, అసత్యాలు, దుర్మార్గాలనైనా చేపట్టవచ్చుననీ, అతి నగ్నంగా ప్రతిపాదించాడు. ఈ మార్గాలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నాటి 15వ శతాబ్దపు రాజులు, రాజకీయవేత్తలు, మతగురువులు అనుసరిస్తున్నప్పటికీ, వారంతా మేక్ వెల్లి సిద్ధాంతాలను తీరా తిట్టి కారాలు మిరియాలు నూరారు. వీరు ఏ మార్గాలనైతే రహస్యంగానూ, బహిరంగంగానూ, ఆచరణలో పెట్టారో, వాటిని సిద్ధాంతీకరించి సమర్థించి ప్రచారం చేయడమే మేక్ వెల్లి చేసిన 'ద్రోహం

## కౌటిల్యుని అర్థశాస్త్రము

తంత్రాలను ఎత్తుగడలను దైవంబిన రాజ్యవ్యవహారాలలో మొలబంటి లోతుదాకా మునిగిన పరిపాలకుడు తప్పక అనుసరించ వలసిందేనని చెప్పాడు. ఐతే ఈ దృక్పథం రామాయణ కాలంనాటికే చిరప్రాయంలో వుంది దానిని విపులంగా వివరించినవాడు కౌటిల్యుడు ఆదికవి వాల్మీకి రామాయణంలో ఈ విధంగా చెప్పాడు—

"నృశంస మనృశంసం వా ప్రజారక్షణ కారణాత్
రాజ్య భార నియుక్తానా మేష ధర్మస్సనాతనః

రాజ్యభారం వహించే వాళ్లకు ప్రజారక్షణమే ప్రధానం క్రూరమైనా, క్రూరం గాకపోయినా, ప్రజారక్షణకొరకు రాజు చేసే ప్రతి పనీ, ధర్మ కార్యమే—అని ఆదికవి వాల్మీకి చెప్పాడు

ఇంగ్లండును పాలించిన ట్యూడర్ వంశరాజు ఏడవ హెన్రీ, తన మంత్రులైన ఎంప్సన్, డడ్లీ, మోర్టన్‌ల, సహాయంతో, ఆంగ్లప్రజలనుండి వైవిధ్యంగానే డబ్బు గుంజాడు ఒకవ్యక్తి ఖర్చు ఆడంబరంగా చేస్తే, నీవు తప్పకుండా భాగ్యవంతుడవు అయివుండాలి గాబట్టి డబ్బు యివ్వమని బలవంతం చేసేవాడు ఎవరైనా చీపరీకంగా తింటే ఎంతో ధనం నిలవచేసి వుండి వుండాలి గాబట్టి అతడి వద్ద, గుంజేవాడు

మహాభారతంకూడా మోసపు పద్ధతులద్వారా డబ్బు గుంజమని సలహా యిచ్చినా కౌటిల్యునిలాగ నగ్నంగా ప్రజలనుండి ధనాన్ని పిండమనిమాత్రం చెప్పలేదు

నిద్రపోయే మనిషిని యెలుక పట్టకొని నెత్తురు పీలిస్తే ఎలాగ, అతడికి మర్నాడు మెలకువ వొచ్చిన తర్వాతగాని తెలియదు రాజ్యాంగయంత్రంచేసే దొంగ దోపిడి అతిసున్నితంగా అంత చక్కని వ్యాపారంగా వుండాలని భారతం చెప్పింది కౌటిల్యుడు యిలాంటి చాటు మాటు దోపిడీ గాక, బహిరంగంగానే దోపిడీ చేయమన్నాడు కౌటిలీయంలో దేవద్రవ్యానికే రక్షణ లేకపోతే, మనుష్యులద్రవ్యాల కిక ఎక్కడరక్షణ?

రాజ్యంలో జనపదం, నగరం అనే రెండుభాగాలుంటాయి గ్రామాల సముదాయం జనపదం పట్టణాలతో కూడింది నగరం పరిపాలనా సౌకర్యంకోసం జనపదాన్ని నాలుగుభాగాలుగా విభజించాలి. కొన్ని గ్రామాలు పన్ను చెల్లించనవసరంలేనివి, కొన్ని పన్నులకు బదులు ప్రభుత్వానికి కావలసిన కూలిపని చేసేవి కొన్ని గ్రామాలు ఆయుధీయాలు గ్రామ పాలనం గ్రామికుని లేక గ్రామస్వామి లేక గ్రామ వృద్ధుల అధీనంలోవుండాలి. గ్రామంలోని వివాదాలను పరిష్కరించేందుకు గ్రామవృద్ధులతో గ్రామపరిషత్తు (పంచాయతీబోర్డు)ఏర్పడాలి పదిగ్రామాలకు మధ్యగా "సంగ్రహణాన్ని", రెండువందల గ్రామాలకి మధ్యగా "ద్రోణముఖాన్ని", ఎనిమిదివందల గ్రామాల నడుమ 'స్థానీయాన్ని' (రాష్ట్రనగరం) నిర్మించాలి. ప్రతి గ్రామంలోను, ఋత్విక్కు, పురోహితుడు శ్రోత్రియులు మొదలయినవారినివుంచి, వారికి మడిమాన్యాలు ఇవ్వాలి అన్ని ఆపదలనుండీ రాజు జనపదాన్ని రక్షించాలి

ఒక్కొక్కశాఖకు ఒక్కొక్క అధ్యక్షుడు నియమింపబడేవాడు పణ్యాధ్యక్షుడు, కోశాధ్యక్షుడు, సూత్రాధ్యక్షుడు, గణికాధ్యక్షుడు, నావధ్యక్షుడు, అశ్వాధ్యక్షుడు, హస్త్యధ్యక్షుడు, రథాధ్యక్షుడు, పత్త్యధ్యక్షుడు, ముద్రాధ్యక్షుడు, వివీతాధ్యక్షుడు, సూనాధ్యక్షుడు మొదలగు అధ్యక్షులు వివిధశాఖలకు నియమింపబడి రాజ్యనిర్వహణలో పాల్గొనేవారు ఈ విధంగా రాజధానినుండి గ్రామసీమదాకా కోటి కొట్ల కొంబులతో చక్రవర్తి అధికారం రాజ్యమంతటి నలుదిక్కులకు కేంద్రీకృతమయంగా ప్రసరించేది

సామ్రాజ్య నిర్వహణలో పాల్గొనే రాజోద్యోగుల లంచగొండితనాన్ని గూర్చి కూడా కౌటిల్యుడు వివరించాడు రాజోద్యోగులు తమ ఆదాయాన్ని వృద్ధిపరచుకొన్నారంటే నానా జనపదాలను విపరీతంగా తినివేశారని, అలా అపహరించినధనాన్ని తిరిగి కక్కేటట్లుచేసి వారిని మరో వుద్యోగంలోకి మార్చాలని కౌటిల్యుడు చెప్పాడు "నాలుకచివర నుంచే విషాన్ని గానీ, తేనెను గానీ ఆస్వాదించకుండా వీలుపడనట్లు, అర్థాధికారికి రాజద్రవ్యాన్ని కొంచెమైనా దొంగిలించకుండుట కష్టం నీటిలోవుండే చేపలు ఎవరికీ తెలియకుండానే నీరు తాగునట్లు కార్యవిధులలో నియమింపబడే వుద్యోగులు ఎవరికీ తెలియకుండానే డబ్బును దొంగిలిస్తారు." అని అంటాడు ఆకాశాన ఎగురుచుండే పక్షులగమనాన్నైనా తెలుసుకో వచ్చునుగాని, ప్రచ్ఛన్న భావులై సంచరించు రాజోద్యోగుల ప్రవర్తన తెలిసికోవడం కష్టతరం సమాహర్త (Collector - general of Taxes) వంటి వుద్యోగాలు చేసేవారిని రాజు నిరంతర జాగరూకతతో పరిశీలిస్తూ వుండాలని కౌటిల్యుడు చెప్పాడు ఉద్యోగులకు పెద్దపెద్ద జీతాలిస్తుండాలి అప్పుడే, రాజ కార్య నిర్వహణలో నిమగ్నులౌతారని ఆయన అన్నాడు.

కౌటిల్యుడు పండితుడు మాత్రమే కాదు. అసాధారణమైన లౌకిక వ్యవహారానుభవం కలవాడు సువిశాలమైన మౌర్య సామ్రాజ్యాన్ని పరిపాలించేం

# కౌటిల్యుని అర్థశాస్త్రము

కౌటిల్యుని తర్వాత అర్థశాస్త్రం ఏ విధమైన అభ్యుదయాన్నీ సాధించలేకపోయింది. క్రీ శ 4 వ శతాబ్దంలో కామందకుడు రచించిన "నీతిసారం", 10 వ శతాబ్దంలో సోమదేవసూరి రచించిన "నీతి వాక్యామృతం" మినహా, మిగతా గ్రంథాలన్నీ అను కరణలు, అనుకరణలుగాను వెలసిన, రచింపబడి నవీ, ప్రాచీన శాస్త్రాల ప్రతిపదికలోనో, ఇంకా సంక్షిప్తంగానో వ్రాయబడ్డ అర్థశాస్త్ర సంకలనాలు ఇవి కొల్లలుగా పుట్టాయి. తత్ఫలితంగా అర్థశాస్త్రాన్ని గూర్చిన అధ్యయనం క్రమేపి క్షీణించి పోయింది. ప్రాచీన భారతంలో ఉద్దండులైన పండిత ప్రకాండులచే, మహామహులైన శాస్త్రకర్తలచే పెంచి పోషించబడి మూడు పూలూ, ఆరు కాయలు కాసిన హైందవార్థశాస్త్రం, తదధ్యయనం క్రమంగా క్షీణ మైపోయింది. కౌటిల్యార్యుల తేజస్సుతో వర్ధిల్లి ప్రకా శించిన ప్రాచీన అర్థశాస్త్రం కౌటిలీయాన్ని అవ శేషంగా మిగిలిపోయింది.

మనకి ఒక అర్థశాస్త్రం వుంది. దానికి వేలసంవత్స రాల చరిత్ర వుంది. ఆ దీర్ఘ చరిత్రలో కౌటిలీయార్థ శాస్త్రం ఒక మహోజ్జ్వల గ్రంథం. మన ప్రాచీన శాస్త్రాన్నీ, దాని చరిత్రనీ కవిలికట్టల్లోనుండి, హస్త భాండాగారాలలో దిక్కూ మొక్కూ లేక పడివున్న వివిధ తాళపత్ర గ్రంథ సందోహమునుండి తవ్వి తల కెత్తాలి. ఎన్నో అర్థశాస్త్ర గ్రంథాలలో చేర్కొనబడ్డ వివిధ శాస్త్రగ్రంథాలు మనకు నేడు ఎక్కడా కనిపిం చడంలేదు. వాటినన్నిటినీ తిరిగి పరిశోధించి, వెలికి తీయాలి. అప్పుడే మనం ప్రాచీన హైందవుల అర్థ శాస్త్రాన్నీ, దాని చరిత్రను సవ్యసమగ్రంగా, సర్వాంగ సుందరంగా కాంతిలోకి తెచ్చి ప్రపంచం ముందు పెట్టగలం

# భాగ్యనగర కోకిల

శ్రీ నాయని సుబ్బారావు

౧

పదిగళము లొక్క గళమై
విదిలించినగతి సుపుష్ట విస్పష్టరవా
భ్యుదయ మనోహరగానా
స్పదమూ ర్తివి శ్యామల ప్రభారమ్యతనూ!

నీ నినద ప్రభావమహా
    నీయ రసోన్నమితమ్మయిన మూ
నీనది తట్టిలేప విక
    సించిన గంధమ్ము ప్రభాసితో
ద్యానవనీ బలాలికయు
    దర్శితు డాతడు పేర్చు జైత్రయా
త్రానిరతిన్ వసంతు డను
    త్ప్రమదోదయ దిగ్దిగంతుడై

అన్యవనస్థలమ్ముల నచిరకాల
మున వసంతుడు తానొక్క ముసలివాడు,
త్వద్దయాపోషిత ప్రాణధనుడు వాడు
నిత్యనూతన యౌవనాన్వితు డచట

నీమాయ యెట్టిదో నీ
శ్రీ మధురకలస్వనమున చిగిరించినవా
రై మరులు కొంద్రు రతియును
కాముండు వసంతరూపకలనాగరిమన్.

౨

సుర్వాలై షేర్వాణీ
పర్వ చిబుకజానుయుగళ పర్యంతము, కిం
కుర్వాణ ధారితక చి
త్తార్వాయిత కింకిరాటు లచ్చటి తరుణుల్.

అరుదగు నీకలరవమున
కరఁగుదురే చార్మినార్ సిగారెట్ దమ్ముల్
జరదా వేసిన బీడా
పరమార్థము వారి కింక పనివలదే మిన్

షెల్వార్ కుర్తా వోణీ
చెల్వమ్ముల విశ్వవిజయశీలి మగని చే
తల్వార్లు క్రొత్త బాదమ్
హల్వా రుచిఁ గాదను రతు లచ్చటి తరుణుల్

అతను సెగకంటి మంటల నార్పజాలు
చలువకాటుక కడ్డి పసందు లోలయు
రెండు జడలఁ రతిదేవు లుంచబట్టి
బ్రదికి రంగసంయుక్తులై భావభవులు

3

వారు సంస్కార శుచులైన భాగ్యవంతు
లొక్కడడ్డీ మహారథ మెక్కివచ్చి
చెలువుకట్ట బెంచీపైన చెరియొకదెస
కొలువుదీర్తురు చేతిగుడ్డలను పఱచి

పకడా వేపుసెనగ పప్పించికొని యు
తంచు నగపాలు మోహంపు తరుణి కిచ్చు,
ఆమె మదనసామ్రాజ్య పట్టాభిషిక్త
యైనరీతి హసన్ముఖయై వెలుంగు

నీవసంతాగమోన్నిద్ర నిభృతరాగ
మంజు శింజాన రమణీయ మధురగీతి
కాదు వారికి, వారు సంస్కార జడులు
వారి మోటారుహారనే వారి వీణ!

౪

కోరి మోటారుసైకిల్ షికారుపోవు
దడదడల డబడబల సిక్కుదర్శకునకు
చెవులు పాగాంతకే సురక్షితము లతని
కేమి వినపడిచచ్చు నీ ప్రేమ ఘోష.

జాఫరావల్లెకొనలు వాల్ జడలు రెండు
రెండు గాలికి టపటపల్ రెపరెపలుగ
అతను విజయధ్వజమ్ము నా నతని వెనుక
సీటుపై రతి కానరి నీపాట వినును

పాటవిని కామపరవశోల్బణము లతివ
చూపు రాకెట్లతని వీపు చొచ్చి గుచ్చి
దూసికొని త్రోసికొనిపోయి తుదకు బవిరి
గడ్డ మాతని దొకయింత కళవళించు

౫

అదిగో మూడు చక్రాలవాహనము స్వీయ
విశ్వరూపదర్శన జిత విష్ణుమూర్తి,
స్వాంతవాహనములు లేని జంటలకును
నరవశృంగార కేళి కాస్థానభూమి.

అతడు నారాయణకుడా మహాప్రశస్త
శీధువానాధరీకృత నీరపాణి,
కలితరథచోదనక్రియా కౌశలమున
దారుకుని మాతలిని తలదన్నినాడు.

గుమ్మటమువంటి రిక్షా
నిమ్ముగ నిఱుకుకొని రతియునించువిలుతుడుగా
కమ్మని నీ కోకోల్ధ్వని
బమ్మెరపోవుదు రౌకళ్ళపై నొక్కరుగా.

పరభృతకుహూనినాద సంభ్రములు వార
లొక్కరా యిద్దరా యన్న చిక్కుపుట్టు,
పరభృతకుహూనినాద విభ్రముడు సూతు
డేకచక్రమ్ముపై సివమెత్తి యూగు.

౬

ఏలోకమ్మునుండి వచ్చితివో నీ
వెందుందువో గాన వి
ద్యాలాలిత్యకళా ప్రపంచమిటు సా
ధ్యమ్మయ్యెనో నీయెడన్
త్రైలోక్య ప్రణయ ప్రసాద రచనా
త్రయ్యంతముల్ సి మహా
లీలల్ మానవవాహనమ్ములు గదా
లీలా శకుంతప్రభూ!

ఒకరాగ మ్మొకపాటగా బ్రదుకు బా
టొక్కింతయున్ దాట కం
గక సుశ్యామల కోమల ప్రభల న
య్యాటన్ తలంపింతు వీ
వాకప లొక్కొక్కశరమ్ము నొక్కవతిగా
నూర్జస్వలాంగప్రదీ
ప్తి కలాప ప్రతిపాలితాఖిల జగ
ద్వీథిన్ రఘూత్తంసమున్.

రాము: (ఉత్సాహంతో) దొరికి పోయేవ్! నువ్వే ఓడిపోయేవ్!

చంద్ర రెండుసార్లు నువ్వోడిపోతే ఒకసారి నే నోడిపోయాను

(యిద్దరూ ఒక్కసారి నవ్వుతారు—ఎడమ చివర రుద్రయ్య కనిపిస్తాడు యిద్దరూ అతని చూసేరు రుద్రయ్య తల ఒకసారి పంకించి—చేతికర్ర సాపుచేసి—మెల్లిగా గడ్డిమేటు వెనక్కివెళ్ళి దాక్కుంటాడు.)

రాము చంద్రీ!

చంద్ర యేం రామా! అలా చూస్తున్నావ్?

రాము అప్పుడప్పుడే యేం లేదు! రేపు పొద్దుపొడిచే సరికి వస్తావని మాటియ్యి.

చంద్ర: నే నెందుకు రావాలి?

రాము (కుడివైపు చూపిస్తూ) అదుగో! ఆ తాటితోపు యెనకాల జాంతోట వుంది చూశావా?

చంద్ర చూశాను.

రాము ఆ తోటని మా చిన్నతాత కౌలుకి పుచ్చుకున్నాడు రేపొద్దుట్నే అక్కడి కెల్దాం

చంద్ర (ఉత్సాహంతో) ఓ! అయితే వస్తాను

(మెల్లిగా మెల్లిగా వెలుగు తగ్గుతుంది ముందు మెరుపు కనిపిస్తుంది. తరవాత ఉరుము విని పిస్తుంది.)

రాము: (ఆకాశంకేసి చూస్తూ) చూసేవా చంద్రీ! ఆకాశమంతా మసిపూసినట్టు యెంత నల్లగావుంది.

చంద్ర యిలాంటప్పుడు వానొస్తే—బలే సరదాగా వుంటాది

రాము: అదుగో! అప్పుడే గాలిదుమారం మొదలయ్యింది మబ్బులు దూదిపింజలలా చెదిరిపోతున్నాయ్. వాన కురిసేయోగం లేదు. (విషాదంగా కుడివైపు చూస్తూ) ఆ పిట్టలన్నీ నిమ్మతోట యెలా గెంతిపోతున్నాయో చూడు! (ఆకస్మికంగా జ్ఞప్తికి వచ్చినట్లు) అరెరే, మా అమ్మ దాకేసివే! చంద్రీ! వెళ్ళిపోతాన్లే! (ఆతృతగా కుడివైపు వెళుతూవుంటాడు )

చంద్ర: (అతని చెయ్యి పట్టుకొని ఆపుచేసి) అదుగో మీ అయ్యకీ మా అయ్యకీని నీకూ నాకూ అడ్డు లేంటి! యిక్కడే వుండు చిన్ని కోతాయిలం తెచ్చిపెడతాను (ఎడమవైపు వెళ్ళిపోతుంది)

రాము (ఆమె చెయ్యి పట్టుకొని) అదేంటో చెప్పు.

చంద్ర నే చెప్పను

రాము నువ్వు చెప్పకపోతే నేను పోనివ్వను

చంద్ర అయితే నువ్వు చెప్పుకో చూద్దాం

రాము పకోడీ

చంద్ర: కాదు

రాము కాటికాయి

చంద్ర ఊహూఁ!

రాము కర్రపెండలంగుంప.

చంద్ర అదీ కాదు

రాము మరింకేంటి చెప్పూ!

చంద్ర (అతని చెయ్యి విడిపించుకొని కిలకిలనవ్వుతూ) నువ్వు చెప్పలేకపోయేవు యీరి మొప్పు సిటికలో వస్తాను.

(చంద్రమ్మ ఎడమవైపు పరుగెత్తుకుపోతుంది రాముడు ఆమె పోతున్నవైపు పరవశత్వంతో చూస్తూ వుంటాడు గడ్డిమేటు వెనకనుంచి రుద్రయ్య మెల్లిగా ముందుకు వస్తాడు )

రుద్ర (ఒక్కడుగు ముందుకి వేసి) ఇంకెక్కడికి పోతావ్ రా యెదవా! (కర్ర రెండు చేతులతో పైకెత్తి రాముడి బుర్రమీద కొట్టేస్తాడు )

రాము (బిగ్గరగా) ఓ తాతా! చచ్చిపోయాన్రా! (కూలబడిపోతాడు. తల, ముఖం రక్తంతో తడిసిపోతాయి)

రుద్ర: (బిగ్గరగా) ఒరేయ్! అడ్డు దాటిన యెదవని సైరా చేసేస్తాన్రా

(మళ్ళీ కర్ర పైకెత్తాడు—అమాంతంగా కుడివైపునుంచి నారాయుడు, ఎడమవైపునుంచి వంకన్న కర్రలు తీసుకొని వస్తారు.)

నారా: (ముందుకు దూకి) ఆగరా! ఆగరా రుద్రిగా! యియ్యేళతో నువ్వు [illegible]

(నారాయుడు కర్ర యెత్తుతాడు. రాముడు కూడా వెంటనే లేచిపోయి కర్ర పైకెత్తుతాడు)

రుద్ర (కర్ర పైకెత్తి) ఒరేయ్! యెంకన్నా! ఊం! కొట్రా! కొట్రా! ఆలోసింగకు

("తిన్నరా తిన్ను" "పాతెయ్యరా! పాతెయ్యి" అంటూ వీరావేశంతో కేకలు వేస్తూ అటు ఇద్దరు ఇటు ఇద్దరూ కర్రలు యెత్తుతారు. అంతలో

